# ఈ నాటకము నందలి ముఖ్యపాత్రలు.

### పురుషులు.

ప్రతాపసేనుడు—కథానాయకుడు.

కొండభట్టు—ప్రతాపసేనుని గురువు.

ఉత్తమశీలుడు—వైశ్యుడు.

దుష్టబుద్ధి—మహాపాతకపురపు రాజు.

మహాపాపి, అనృతవాది—దుష్టబుద్ధి మంత్రులు,

మహానీచుడు—దుష్టబుద్ధి సేవకుడు.

దొంగ.

1, 2 రాజకుమారులు.

సేవకుడు.

దుర్వాసుడు—ఒకముని.

### స్త్రీలు.

కాంతామతి—ప్రతాపసేనుని భార్య, కథానాయిక.

కాంచనమాల—ప్రతాపసేనుని వేశ్య.

రత్నమాల—వేశ్య దాసి.

చంద్రరేఖ—కళింగరాజ పుత్రిక.

కొందఱు దాసీలు, మఱికొందఱు వేశ్యలు.

---

ప్రదర్శకులకు సూచన.

లిఖితరూపకముగ నాయనుమతిని పొందనివారు

## ఈ నాటకమును ప్రదర్శింపఁగూడదు.

అటుగాక స్వతంత్రించిన వారలు నానష్టమునకు పాత్రులగుదురు.

వేజండ్ల,
గుంటూరుజిల్లా.

జె. కోటీశ్వరరావు,
గ్రంథకర్త.



భారతీయసోదరులారా.

"కాంతామతి" నాటకము అయిదవకూర్పు కూడ వెలసినదని వచియించుట కెంతయు సంతసించుచున్నాఁడను. యీనాటక మనేక నాటక సంఘములవారు ప్రదర్శించుచుండిరి, అందుకొన్ని సంఘముల వారు "దుర్బుద్ధికిని, రాజకుమారునకు"ను కొన్ని పద్యములుండిన బా గుండునని పలుమారులు వ్రాయుచుండిరి, అందుచే వారల యాశ్రిత మీడేర్చితిని.

మఱియు "ప్రతాపసేనుఁడు" సర్వమునంగోల్పోయి కాంతారమునకనిపిన నిజకాంత "కాంతామతి" యన్వేషణము యిదివఱలో విష్కంభమున నుంచితిని. ఆయారంగమును యిపుడు "తృతీయాంకము న" తురీయరంగముగ వ్రాసియున్నాఁడను. ప ప్రదర్శకులారంగము నుఁగూడ ప్రదర్శింతురుగాక యనినాకోర్కె.

ఆంధ్రసోదరులెల్లరు ప్రథమ ద్వితీయ తృతీయ ముద్రణములందు జూపినయాదరణ మీచతుర్థముద్రణమునంగూడ జూపెదరు గాకయని యెల్లరఁ బ్రార్థించెదను.

ఇట్లు.

వేజండ్ల,
1—3—1936

గూడూరు కోటేశ్వరరావు
గ్రంథకర్త.



# సంపూర్ణరామాయణము

(గ్రంథకర్త, గూడూరు కోటేశ్వరరావుగారు.)

ఇందు బ్రహ్మాదిదేవతలు రక్కసులవలన బాధలుపడలేక శ్రీ మహావిష్ణువును ప్రార్థింప శ్రీమహావిష్ణువు దశరథునకు పుత్రుడుగా జనించుట, విశ్వామిత్రుని యాగసంరక్షణము, శిలయైపడియున్న అహల్యను తన పాదరజముచే శాపవిముక్తం జేయుట. హరువిల్లువిరిచి సీతను పెండ్లాడుట, త్రోవలో యెదుర్కొనిన పరశురాముని గర్వభంగము సల్పుట, కైకవరములచే సీతారామలక్ష్మణులు అరణ్యమునకు వెడలుట, దశరథుడు పుత్రప్రేమచే విగతజీవుడగుట, కౌసల్యా విచారము, కైకేయి తనకుమారుడగు భరతునకు రాజ్యప్రాప్తిగలిగినదని సంతోషము, భరతుడు కైకను దూషించి, చిత్రకూటపర్వతారణ్యమున నున్న సీతారామలక్ష్మణులను రాజ్యమునకు వచ్చి పట్టాభిషిక్తుడవుగమ్మనుట, పట్టాభిషేకముచేయుమని తన పాదుకలను భరతునకొసంగుట, పాదుకాపట్టాభిషేకము, శూర్పణఖ ముక్కుచెవులుకోయుటచే రావణాసురునకెరింగింప రావణుడు కోపోద్దీపితుడై మారీచుని మాయాలేడిగా బంపి సన్యాసివేషమున సీతనపహరించుట, రామలక్ష్మణులు సీతంగానక చింతిల్లుట, సుగ్రీవ సఖ్యమున సీతజాడను తెలిసికొనుట, వాలిసంహారము, హనుమంతుడు లంకంబ్రవేశించి సీతంగాంచి అక్షయునిజంపి వనమువిధ్వంసము జేయుట, రావణుడు మండిపడి తోకకుఅగ్ని దగుల్పుమనియాజ్ఞనియ్య ఆయగ్నితోనే లంకాపురి దహింపజేయుట, అంగద రాయభారము నిష్ఫలంబగుట, రామలక్ష్మణ సుగ్రీవ హనుమంత జాంబవంతాదులతో సముద్రమున సేతువుగట్టి లంకంబ్రవేశించుట, ఇంద్రజిత్తువధ, లక్ష్మణమూర్ఛ, హనుమంతుడు సంజీవిచే లక్ష్మణుని బ్రతికించుట, రామ రావణయుద్ధము; రాముడు రావణుని విగతజీవుని జేయుట, సీతఅగ్ని ప్రవేశము: శ్రీరామపట్టాభిషేకము మొదలగు సంశములతో నలరారుచున్నది. చక్కని పాటలుగలవు. వెలస్వల్పము. ఫలమధికము. వెల 1—4—0

వలయువారు కందుల గోవిందం జనరల్ బుక్కు డిపో

బెజవాడ, కృష్ణాజిల్లా.



శ్రీరస్తు.

# కాంతామతి.



## ప్రస్తావన.

[ప్రవేశము—నటుడు.]

శా. శ్రీరామామణి నప్పుడా నురమునన్ ✦ జెన్నొందగాఁ దాల్చి బల్
గారామొప్పగ మౌనిబృందముల ను ✦ త్తరశ్రేణి రక్షింపుచున్
క్రూరాత్ముల్ గను తుచ్ఛమానసుల ని ✦ ర్మూలంబుగాఁ జేయుచున్
ధీరుంగాంచిన విష్ణుమూర్తి యొసఁగున్ ✦ దెంపారు నైశ్వర్యముల్.

ఇంకను నటి రాకున్నదేమి నటీ! యిటు రమ్ము.

[ప్రవేశము—నటి]

నాథా! సెలవు?

నటు—నేఁడు నూతనముగాఁ జేయఁబడిన కాంతామతి నాటకముఁ బ్రదర్శింపవలెనుగదా? నటకులు సిద్ధముగ నుండిరా?

నటి—సిద్ధముగనే యుండిరి. మనమును బ్రవేశింపవలయును.

నటు—చెలీ! ఇంత బాగుసేయక నీ గానకళానైపుణ్యముఁ జూపి యించుకంత సంతసింపఁ జేయుము.

నటి—ఏ ఋతువును గురించి వర్ణింతును?

నటు—పోనిమ్ము. ఋతువువలదు లెమ్ము. ఇపుడు రాగల కుంతలదేశాధీశుండగు ప్రతాపసేనుని యాస్థానమును వర్ణింపుము.

నటి—ఆర్యా! అతని కొక యాస్థానముగలదా? వేశ్యయగు కాంచన మాలాసక్తుండై సర్వమును నా వెలయాలికి ధారవోసినవానికి యాస్థానమేడ? నేను వర్ణించుటేడ? ఈపండితమండలి ప్రోల వాని నుచ్చరింపఁదగునా? వినసేమనెదరు?

నటు—విన వలదు లెమ్ము. ఇప్పటికే నడురేయి గావచ్చినది. ఇంక మనము కర్తవ్య మాచరింతము.

నటి—కాంతా! ఇంతకు కవి యెవ్వరు?

నటు—ఇంకను కవి యెవ్వరైనది యెఱుంగవా? వినుము.

సీ. వరభీమకశాస్త్రియు ♦ భవ్యుఁడు మృత్యుంజయు
ధార్మికుం డెవ్వని ♦ తాతతాత?
ఘనకీర్తిసాంద్రుఁడ ♦ కృష్ణముగ నుబ్బయా
ఖ్యాతుఁడే మనుజుని ♦ తాత తండ్రి?
శాస్త్ర పురాణముల్ ♦ చదివిన మల్లాభి
ధానుఁడే మానిసి ♦ తండ్రితండ్రి?
ఘన "వైద్యవేత్తయు ♦ కవిపుంగవుండు" వేంక
టశివుఁ డెవ్వనికిసిం ♦ పొసఁగు తండ్రి?

గీ. అట్టి కూడూరు కోటీశ్వ ♦ రాహ్వయుండు
ధరణి కాంతామతి చరిత్ర ♦ వరసగ తని
నూతనమ్ముగ రచియించె ♦ ఖ్యాతిమీఱ
చిన్నవాఁడు కైత చెప్ప ♦ దున్నవాఁడు.

నటి—ఓహో! మన కోటీశ్వరరావా?

నటు—ఔను! ప్రేయసీ! చాలప్రొద్దయినది పోదము రమ్ము.

నటి—చిత్తము.

(నిష్క్రమింతురు.)

---



శ్రీ

# కాంతామతి.



## ప్రథమాంకము

ప్రథమరంగము:—కాంచనమాల సౌధము.

[ప్రవేశము:—కాంచనమాల, కొందఱు సఖులు]

(అనుబంధము 1)

నేఁటికి మూఁడు దినములనుండి నా విటుఁడగు "ప్రతాపసేనుఁడు" రత్నమాల యింటికేఁగుచుండెనని వినియుంటిని. విన నేమిలే. ఆతఁడు నేనన్న ప్రాణముల విడుచునుగదా? నేఁడైన రాకయుండునా? వచ్చినతోడనే మాటలవ్యత్తిరీతిగా నాతని నిరాకరించియు, బెదరించియుంచెద. ఆప్రతాపసేనుఁడు నాపైఁగల మోహముచేఁ జీవాశ్లైనను దినును. చెప్పుదెబ్బలైననుదినును. ఇందుకు సందియము లేదు. ఆహా! మోహమెంత చెడ్డది? ఎట్టి పురుషసింహుని నైనను పదదాసునిఁ జేయునుగదా? ధనాధిపునినైనను సేవకునిఁ జేయునుగదా? ఈ ప్రపంచమున పురుషులస్త్రీలచేఁజిక్కిన కీల్బొమ్మలవంటివారు. ఇందులకేమియు సందియము లేదు. సఖులారా! మీరిప్పుడే నందనోద్యానమునకుఁ బని విరిసిన ప్రసూనములఁ గొని తెండు. ఆలసింపకుఁడు. ప్రతాపసేనుఁడు వచ్చువేళ సమీపించినది. ఇఁకపొండు. శీఘ్రముగ దిరిగిరండు.

సఖులు—అక్కా! కోమటికుమారుని బావగారువచ్చిన నట్లుగా సాచె
రించెదవో? వానికి బుద్ధివచ్చునట్లొనర్పవలయు. మేము పోయి
వచ్చెదము.

కాంచ—మంచిది పోయిరండు.

(సఖులు నిష్క్రమింతురు.)

గీ. వలపులను బట్టుకొమ్మ మా ◆ వారకాంత
మాయలకు పుట్టినిల్లు, మా ◆ మానిను లిల
రోగముల కెల్ల మూలంబు ◆ రోకులంబు
యిట్టి మమ్ములఁ జేపట్టి ◆ యేగగలరె?

మఱియు,

గీ. ధనకుని నిరాకరించెడి ◆ ధనికునైన
సర్వవిద్యలు నేర్చిన ◆ సరసునైన
మూఁడురోజుల మురిపెంపు ◆ ముద్దుజూపి
సర్వమును నున్న జేయదే ◆ సానిపొందు.

ఇంక నే జెప్పఁ బనిలేదు. మా వేశ్యలఁగూర్చి ఇదివఱకే యనేక నాటకము లాడుచుండిరి. ఐనను మా వేశ్యలు బహు మాయలమారులు. కపట ప్రేమధారులు. అనృతవాదులు. వేయేల? సర్వము లోకులకే దెలియు. ఇంక రూపలావణ్యములన్న మిసమిసలాడెడి మేడిపండువలె పైపసందులచేతను, కన్నుసైగలచేతను, లేనిపోని వేషభాషలచేతను విటులను లోఁబఱచుకొను ప్రజ్ఞ సర్వరక్షకుండగు భగవంతుఁడు మా కులమున కొసంగెను. (లోనకుఁ జూచి) ఎవ్వరో వచ్చుచున్నట్లున్నది. ప్రేమావసేనుఁడవా? ఆ! అతఁడే, నేనింక కపటదృష్టి దానివలె నిందు శయనించెద.

(అని నేలపై ముసుఁగుతో శయనించును.)



[ప్రవేశము:—ప్రతాపసేనుఁడు అలంకృతుఁడై]

నాముద్దులగుమ్మ, నావలపులకలికి, నామనోహరి, కాంచనమాల, ఏది? కాన్పించకున్నదే? కాంచనమాలా! కాంచనమాలా! (క్రిందఁజూచి) ఓహో! ఏల యిట్లు భూశయ్యపై శయనించియున్నది? కారణమేమైయుండును? నాపై కోపగించి యిట్లొనర్చియుండెనా? (దగ్గరజేరి) ప్రియకాంతా! కాంచనమాలా!

(అనుబంధము 2)

కాంచ—(దిగ్గున లేచి) ఎవరునీవు? నాసౌధమునకు రాఁ గతమేమి? అవలకుంబొమ్ము.

ప్రతా—కాంచనమాలా! ఏమిది? యిట్లు బల్కెదవు? నే ప్రతాపసేనుఁడఁగానా? చూడు.

కాంచ—నీవు ప్రతాపసేనుఁడవైన నాకేమిలే. పొమ్ము. నేఁటికిమూఁడుదినములనుండి లేని కాంచనమాల నేడు కావలసి వచ్చినదా? చాలు. చాలు. నీకథయంతయుఁ దెలిసినది.

ప్రతా—ఏమిది? ప్రేయసీ! కాంచనమాలా! నేడేమీవింతగఁ బల్కుచుంటివి?

కాంచ—ఔను! అంతయు వింతగనేయుండును. రత్నమాలతో స్నేహముఁగూడ వింతగ నుండదా?

ప్రతా—రత్నమాల! ఎవ్వరు? స్నేహము ఎవరు జేసిరి?

కాంచ—ఎవ్వరోయననేల? నేఁటికి మూఁడుదినములనుండియు రత్నమాలాలోలుఁడవైయుండుటెఱుంగమా! పిల్లికనుమూసి పాలు ద్రావుచుండుట యెల్లవారు జూచుచునేయుందురు, ఇంక నాతోఁ ద మీకుగావలసినదేమిలే? పొమ్ము. రత్నమాలయే నీకాంత.

వ్రితా—ప్రాణప్రియా! చెప్పెద వినుము. నేఁటికిమూఁడుదినములనుండియు నీకడకు రాకుండుటచే నీకిట్టియూహ కల్గినది. కలిగిన కల్గవచ్చుగాక. నాగురువుగారు వచ్చియుండుటచే నాకు రావలనుగాదు. ఇందులకు వేఱుగ నెంచకుము.

కాంచ—రావలను బడని కార్యమేమిజేయుచుంటివి ?

వ్రితా—కొన్నివిషయములు మాటలాడవలసి ముచ్చటించుచుంటిమి.

కాంచ—ఏమివిషయములఁ గూర్చి? నన్నుఁగూర్చియేనా ?

వ్రితా—కాదు. కాదు. రాజ్యాంగమునుగూర్చి ముచ్చటించుచుటిమిఁ నీవిషయ మచ్చట యేల దేవలయు ?

కాంచ—నావిషయమై యేమియు ముచ్చటింపలేదా? ఇం దసత్యము బల్కితివి?

వ్రితా—కాదు గాని నీవిట్లుండఁ బాడిగాదు. "వివాహ మొనర్చుకొనుము" అనివల్కినాఁడు.

కాంచ—అందుల కేమని మారు బల్కితివి?

వ్రితా—నాకు వివాహమెందుకు? వలదని బల్కితిని.

కాంచ—నిజముగ నట్లుపల్కితివా ? కల్ల. నమ్మఁజాల.

వ్రితా—ప్రేయసీ! ఇంకను నాయందు నీకు నమ్మకము కల్గలేదుగదా?

చ. కలికి ! మిటారి నామతిని ♦ గన్గొనవైతివినిన్నుబాసి నే
నిలువగనేర్తునే? క్షణము ♦ నిక్కము పెండిలియాడ నింక నిన్
గలసియు సర్వసౌఖ్యముల ♦ గాంచెదనంచుఁ దలంచుచుంటినో
జలజదళాయతాక్షి ! విను ♦ సౌఖ్యము స్వర్గము నీవె నా కిలన్.

రమణీమణీ! నీకన్న నాకెక్కుడు గలవస్తువు నొందుజూదినను గాన్పింపఁదయ్యె నిన్నుజూడని నిముషమొక్క యుగముగనుండును. అట్టినిను బాసి నేఁబ్రతుకఁ గలనా?

కాంచ—ఏటికిఁబల్కెదవు? ఇది నిక్కమా? ఒకటి చెప్పెదవినుము.
ఉ, కాముకులైనవారు తమ ♦ కార్యము దీరినయంత దాని న
య్యామును జూడకుందురను ♦ యుందటిసుద్దులు నేమెఱుంగనే ?
ప్రతా—
కామిని! యేలయిట్లనెదు ? ♦ కాముకులెల్లరు నట్టిజేతురా?
స్వామిదొఱుంగు నామతము ♦ భావమునందున వేరుసేయకే.
ప్రాణేశ్వరీ! నీరూపమే నాకానందము. పరమానందము. బ్రహ్మా
నందము. నీకన్న నాకెక్కుడు లోకమెయ్యది? సర్వకాలసర్వావస్థల
యందును నిన్నుదక్క నన్యస్త్రీని భ్రమించియుఁ దలంచియు నెఱుం
గను. ఇంకముందు దలంచను. ఈమాట నమ్ముము.

(తెరలో) మహారాజా! సలామ్.

ప్రతా—సేవకా! రమ్ము.

(ప్రవేశము సేవకుడు)

సేవ—మహారాజా! సలామ్.

ప్రతా—ఏమిరా విశేషములు?

సేవ-క్యాబీనై మహారాజ్. నిన్నవొచ్చివుండలేద్ ఓబుఢీబులాతాహై.

ప్రతా—నిన్న వచ్చియుండిన దెవ్వరురా? (అని ఆలోచనఁ జేయును.)

సేవ—తెల్సింది నైమహారాజ్. మోటాలకిడీ పకడో—ఆయానీ బుఢీ
ఉన.ఆయాను జరూర్సి అవ్ ఉతో.

ప్రతా—వాకొఱకై ఇప్పుడు వచ్చువారెవ్వరు? సేవకా! ఎవ్వరు తెలి
యకుండఁ జెప్పెదవు.

సేవ—మాలుంనై క్యా. అది అది కాండ కాండ క్యాకి ఆకానీ అంకు
కల్ ఆయానీ బుఢీ. ఉను ఆయా. అబ్ మాలుంహై.

ప్రతా—ఓహో! గురువుగారగు కొండభట్టుగారా?

సేవ—అ ఉన్ గురు కొండభట్టు.

కాంచ—సేవకా! గురువైననేమి లావా? యిప్పుడు వచ్చుటకు వల నుగాదని దెల్పుము. పొమ్ము.

సేవ—ఠైరో తుంకు బులాయునీ, క్యా మహారాజ్! ఆతానీ?

ప్రితా—సేవకా! నేనిదే వచ్చెద. నీవు గురువుగారికడకుఁజని వారికి వల, యు సాముగ్రిలనిచ్చి నానిలయమందే యుండునట్లుఁ జేయుము.

సేవ—అచ్ఛా! (తనలో) కాంచనమాలా సైతాన్ వైసాకరే? అబ్ హం క్యాదిస్తా? ముందు వుండది ముసళ్ళవండ్ల, అబిక్యాహై (అని నిష్క్రమించును.)

ప్రితా—మనోహరి! కొండభట్టుగారు వచ్చియుండిరి. నే నింక వారి దర్శింపఁబోవలెను. సెలవా? ఇప్పుడే వచ్చెదను?

కాంచ—ఏమి గురువు, నాకన్న నెక్కుడగునా?

ప్రితా—ఎక్కుడైనను గాకున్నను కులగురువుగదా? దర్శింపకుండు టెట్లు?

కాంచ—నీ విప్పుడు పోవలదు.

ప్రితా—పోయిననేమి? ఒక్క నిముషములో వచ్చెదనుగదా? ఏమం దువు?

కాంచ—అట్లయిన నేను రెండుసంగతులఁగోరెద నవియిచ్చెదనని యానఁబెట్టిపొమ్ము.

ప్రితా—నీ కేవేళనైన నడ్డుజెప్పియుంటినా? సర్వవ్యవహారములయం దును నిన్నే ప్రధానమునిగ నెంచితినే?

కాంచ—అట్లుగాదు. నీగురువెంతబోధించినను వివాహమునంగీకరిం పకుము, నీ వట్లొనర్చితివేని నే ప్రాణపరిత్యాగము జేసికొని యెద.

ప్రితా—(పట్టుకొని) ఆ. ఎంతమాట అటులఁ జేయుదును, నీయా జ్ఞమీరువాడనా? నీవు వలదన్న వివాహ మేలజేసికొందును?

కాంచ—రెండవది నీకుఁగల రాజ్యములోని సర్వాధికారము నా కొసంగవలయు.

ప్రతా—అట్లనే యొసంగితి గైకొనుము.

కాంచ—అది మాటలతోఁగాదు. క్రియలతోఁగావలయును.

ప్రతా—ఐననేమందువు?

కాంచ—నీ వ్రేలియుంగర మిట్లిమ్ము.

ప్రతా—ఇదిగో గైకొనుము. (అని యిచ్చును.)

కాంచ—అప్పుడే అయినదా ? నీకు నేను రాజును, నాయాజ్ఞమీరక నీవు నడచుకొనవలయును, ఇందులకు సమ్మతింతువా?

ప్రతా—ప్రాణప్రియా! నీయాజ్ఞకు మారుచెల్లునా? నీ వెట్లాన తిమ్మన్న నట్లనే యాచరించెద, ఇందులకు సందియము లేదు, సెలవా ? నిముసములో మరలివచ్చెద.

కాంచ—నేఁజెప్పినది మరచెదవా ?

ప్రతా—ఏమది ?

కాంచ—వివాహము వలదని,

ప్రతా—నీయాజ్ఞోల్లంఘన మొనర్చి వివాహ మొనర్చుకొందునా? వివాహ మొనర్చుకొన్నను ఇంతకన్న నెక్కుడు సౌఖ్యము గలదా ?

[ప్రవేశము సేవకుడు]

సేవ—మహారాజ్! సలామ్.

ప్రతా—ఏమిరా! మరల వచ్చితివి?

సేవ—ఉస్ బులాకా హై మహారాజ్!

కాంచ—సేవకా! ఆయన ఎందులకు వచ్చినాడు?

సేవ—అంకు క్యామాలుం. ఆయాతో ఆతా నైహితో నైహి ఫిర జాకో బుఢీకు అంతాసెప్తాం, అమార ఖజాన క్యాజాతే ?

ప్రతా—సేవకా! రమ్ము పోదము. (నిష్క్రమించును)

కాంచ—(ఒకవైపునకు) (నిష్క్రమించును.)

సేవ—కాంచన్ మాలా మాటల్కొయిని ఖజానా అంతా ఖరుసుపెట్టి ఫేల్తాహై. అబ్ మాలుం. ఇంతయింత పెద్దరాజుల్కొనూసి ఉండాంలేదు మాయామాటల్ సెప్తే మాకితెల్వాదు ఏం? అంకుక్యా. దస్‌రూపీ ధర్మేవాలాకు బడా యిశారణఎండ్కు. కాంచన్ మాలా థోక్లే అయ్యగార్కి బుట్టలో పెట్టింది. అంకు సాబ్బీమాలుం. కాంచన్‌మాలా మీదదుమ్మురద ఉన్ ఘర్కు ఆకోజాకో బులానేకా మర్జాతుంరేహై. మారాజు యిక ఉంటాడువం, కాంచన్‌మాలాయేసిన ధంకావలాన్ రాజుకొంప ఖలాస్.

(నిష్క్రమించును)

ద్వితీయరంగము; చిత్రావసేనుని యాస్థానము.
[ప్రవేశము: చిత్రావసేనుడు కౌండభట్టు]

చిత్రా—ఆచార్యా! ఏలమీకీపట్టుదల? మీరెన్ని చెప్పినను నామన మునకెక్కవు. ఎందుకిట్లు బోధించెదరు?

కౌండ—చిత్రావసేనా! వేశ్యకాంత నీకు శాశ్వతమా? సరివారు చిన్నవగుబాటుగాదా? కులమున కపకీర్తిరాదా? యశంబు పోదా? వివాహంబొనర్చుకొమ్మని నిక్కచ్చిగఁబల్కుటవాదా? చాలు చాలు నీవెడగులు వివాహంబొనర్చుకొనుము.

(అనుబంధము 8.)

చిత్రా—గురువరా! వేశ్యనుంచుకొనుటతప్పా? ఈ పుడమిపై నెంద ఱెందఱు వేశ్యాలోలురైయుండలేదు? నీవుమాత్రము సంగ నాచినా?

చం. తలయును గడ్డమున్నరిసి ♦ కాసిరీతిగ నేటికుంటి వీ
వలబలమున్న యత్తరి వి♦టావళివృత్తివహించలేదె? యా

జలజదళాక్షులఁ గలసి ♦ సౌఖ్యగతిఁ జరియించలేదె? నేఁ
బొలఁతిని కాంచనామణిని ♦ బొంది సుఖించఁగ దూర్వైతివా?
చాలుచాలు యిట్టిప్రసంగములు నాకడఁజెప్పకుఁడు. ఇంక నేవినువాఁడ గాను.

కాండ—(తనలో) ఓహో! తొండముదిరి యూసరవిల్లియైనదే. నేను నీతులుదెల్ప నన్నెనిరాకరించుచున్నవాఁడు, ఇంక నితరులు దెల్పిన నీతఁడు వినునా? (ప్ర) ప్రతాపసేనా! శాంతించుము, ఇంక నొక్కటిదెల్పెద మనమున యోజించుకొనుము.

ఆ. వారకాంతఁగూడ ♦ వైభవంబేసని
దలఁచుచుంటివీవు ♦ ధరణిలోన
దుర్యశంబు గల్గు ♦ నోయని యోచన
బొడమదయ్యె నీకు ♦ బుద్ధిలోన;

ప్రతా—అయ్యా! వినుఁడు. ఆకాంచనమాల మాటయే నాకు వేదాక్షరంబు, దానియాజ్ఞయే నాకుజీవనము గాన దానియనుమతిలేక వివాహంబొనర్చుకొనజాలను క్షమింపుఁడు.

కాండ—ఓయీవెఱ్ఱివాఁడా; వేశ్యమాటవిని వివాహంబొనర్చుకొనని వెఱ్ఱివాఁ డీలోకమునగలఁడా? వివాహం బొనర్చుకొనఁగదా? పుత్రపౌత్రాదులుగల్గుట? దానివలనఁగదా వంశాభివృద్ధి? దానివలననేగదా సర్వసౌఖ్యములు? దానివలనఁగదా యశశ్చంద్రిక నలుదిక్కులఁ బ్రకాశించుట? నీసరిరాజులువిన్న నీయెడ గౌరవముండునా? ప్రజలకు ప్రభుభక్తియుండునా? జన్మంబు నకుమానాభిమానంబు లుండవలదా? కీర్త్యపకీర్తులు దలచం వలదా?

ప్రతా—గురువరా!

ఉ. మానముపోవుగాక యభి ♦ మానధనంబడుగంటుగాక; నా
ప్రాణముపోవుగాక మఱి ♦ ప్రాభవమంతయు వీడుగాక నా

భానుఁడు త్రోవఁబోక హిమ ♦ భానుఁడు వేడిమిఁబూనఁగాక నా
మానినిఁబొందుపీడ టదు ♦ మాట నసత్యము వేయునేటికిన్,

కావున కాంచనమాలతో నేనింక వివాహమాడనని బాసచేసియున్నవాఁడ. అట్టివాఁడ నేనెట్లుగా వివాహమాడుదును? మరియు, కాంచనమాల యెట్లు చెప్పిన యట్లు వినవలసియున్నది. కాని అన్యథాచరింప వలనుపడదు. నాయందు దయయుంచి నన్ను వివాహమాడుమని మీరు నిర్బంధింపకుఁడు.

కాంత—చిత్రాంగసేనా! మీరా దెఱుఁగక జరించెదవా? చిన్నపెద్దలనెఱుఁగక సంచరించువానికి గౌరవముండునా? గురువునగు నాయాజ్ఞఁగూడ నిరాకరించెదవా? నీమేలుకొఱకై యింతగఁ జెప్పుచుంటినిగాని, వినకున్న నెవరు చెప్పెదరు? నీకన్నధనాధిపులే వేశ్యాలోలురై నిలువనీడ లేకయుఁ గుడువఁగూడు లేకయుఁ దుదకు సన్యాసులై తిరలాడుచుండిరి. కామాంధకారము కన్నుల గప్పుటచే నేమియుం దెలియక వెలకాంతమాయకులోనై కుల్కుచుంటివి. ఇప్పటికైనను తెలివి తెచ్చుకొనుము. కులగౌరవము నిల్పుకొనుము. చిత్రాంగసేనా! ఈరహస్యము వినుము.

ఉ. "ఎవ్వఁడు మీ రెఱుంగక య ♦ థేచ్ఛనువైరవర్తిం జరింపఁగా
నవ్వల వంశహాని మరి ♦ హాని యశోధనహాని పుట్టుఁ దా
నవ్విధ గమ్మనుష్యుఁడను ♦ నయ్యవివేకి చెడుం జగంబునన్
నవ్వఁగఁబాలు గౌరవము ♦ నంజడఁబాలును నిందపాలునై"

అను మార్యోక్తి నించుకంత మనమునఁ దలపోయుము.

చిత్రా—ఆచార్యా! మీపట్టుదల విడువరా?

కాంత—గురువునగు నాయాజ్ఞ మీఱి జరించెదవా?

చిత్రా—గురువరా! ఇందులకేమి సేయమనెదరు? నా కాంచనమాల నువీడఁజాల.

కాంద—పోనీ, వీడకున్నను సరియె. వివాహమొనర్చుకొని పిమ్మట వేశ్యనుంచుకొనుము.

ప్రతా—అట్లైన నంగీకరించెద.

కాంద—మంచిది. కానీ సంతోషమైనది.

ప్రతా—కాని, వివాహమునకు మాత్రము నేను రాను.

కాంద—నీవు రాకున్న యింక వివాహ మెవ్వరికొనర్పవలయు ?

ప్రతా—ఈ ఖడ్గమునకు.

కాంద—ఇట్లొనర్చిన జగము మెచ్చునా?

ప్రతా—మెచ్చిననేమి, మెచ్చకున్ననేమి? నాకుఁ దడవగుచున్నది. ఇదె వెళ్ళెద. (అని పోఁబోవ కాందభట్టు అడ్డగించి)

కాంద—వత్సా! ప్రతాపసేనా! ఏమి చెప్పితివి?

ప్రతా—చెప్పినదియేమి? సర్వమునకీ ఖడ్గమే ?

కాంద—మంచిది. అట్లనే యొనర్పుత.

ప్రతా—ఆచార్యా! మీరు దయనముగందు. మంత్రిచే ఖడ్గమును బంపెద. (నిష్క్రమించును)

కాంద—ఓరా! ఏమీ వేశ్యలమాయ? ఏమియు నెఱుంగని యీప్రతాపసేనుని యెంతకామాతురునిగ జేసెను. ఔను. స్త్రీలవలన గదా లోకమంతయు మోసపోవుటలు? అందు వారాంగనయన్న వేరుగ జెప్పవలయునా?

గీ. దర్శనముఁ జేయ నెమ్మది ♦ దత్తరిల్లు
స్పర్శనమ్మున సంపదల్ ♦ సమసిపోవు
గాన వేశ్యలతోఁ బొందు ♦ మానుడనుచు
వేఁడుచుంటిని యువకుల ♦ వేయిగతుల.

ఆర్యులారా! వేశ్యలన్న గుర్తెఱిఁగి సంచరింపుఁడు. ధనతను మదాంధతచే విఱ్ఱవీగకుఁడు, (నిష్క్రమించును. యవనిక జారును.)

తృతీయరంగము:— కాంచనమాల సౌధము.

[ప్రవేశము: ప్రతాపసేనుడు] (ఆసీనుడై) [కాంచనమాల]

కాంచ—ప్రాణేశ్వరా! నన్నింది మౌనముఁ జేసితివే ?

ప్రతా—నీకేమియు లోటులేదు. భీతి జెంకకుము, ప్రేయసీ ! నాకు నీయెడఁగల సంతసమునకు మితిలేకయుండునుగదా? లభించిన వారాంగనలపొందే లభించవలెను.

కాంచ—ప్రాణేశ్వరా ! నేడు నృత్యగానములచే కొంతకాలము గడుపుదునా ?

ప్రతా—నీయిష్టమగునట్లొనర్పుము.

కాంచ—రత్నమాలా ! ఏమిచేయుచుంటివి ?

(తెరలో) ఏమియు లేదు.

కాంచ—మీరెల్లరు నలంకృతులై తీవ్రముగరండు.

[ప్రవేశము: కొందరు వేశ్యలు] (అలంకృతులై యిరువైపులనుండి.)

కాంచ—సఖులారా ! నేఁడు మీబావగా రానందించునట్లు నృత్య గానాదు లొనర్పవలయు.

వేశ్య—(అట్లుఁ జేయుచు) (అనుబంధము 4)

ప్రతా—(సంతసమున)

చ. కలికిమిటారి ! వయ్యారి ! చూ ♦ కాటపు నాటలపాటలన్ సుధఁ
గిలికితొ, తదీసంబునకు ♦ శేముషి సంతసవార్ధిఁ దేలె ని
య్యలఁగల మోదులంజివురు ♦ లెట్టువహించెనో జూడుమీ సభా
స్థలి జనులెల్ల, జాళిలల ♦ చందముగాఁ గనువట్టి రిత్తరిగా.

(దగ్గరకుఁ జేర్చుకొని ముద్దిడుకొని) ప్రియకాంతా! నిక్కముగ నీవమరలోకమున దేవవేశ్యవై జనింపవలసినదానవు. నాపూర్వపుణ్యావయః పరిపాకముచే నన్నుద్ధరించ నీలోకమున జన్మించితివి. ఆహా ! నేనెంతకృతార్థుఁడ, ఎంతధన్యుఁడ. ఎంతపుణ్యుఁడ. నాకుజనించుచున్న

యానందమునకు నీవుగదా మూలంబవు? ప్రియా! నాయానందమును భరింపఁజాల. సఖులారా! మీరింక పొండు. మీకువలయు పారితోషికము లొసంగెద రెండు.

[వేశ్యలు క్రమముగా నృత్యముఁ జేయుచునే నిష్క్రమింతురు.]

కాంచ—ప్రాణప్రియా! నృత్యగీతాదులేమైన రుచించినవా ?

ప్రీతా—రుచించినవా యని అల్కనేల? రుచించుటయగాదు. అందలి రసమును గ్రోలితిని. ద్రాక్షాపురందేతుఖండశర్కరలకన్నఁ నెక్కుడు రుచ్యమై మనమున కానందమొసగెను గాని యింక మనము లోనికి బోవుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

[ప్రవేశము: సేవకుఁడు. కాంతామతి చిత్రపటముతో]

మహారాజ్. అందర్ కు ఆనా?

(తెరలో) ఎవడురా? అచటనే యుండుము.

[ప్రవేశము: కాంచనమాల.]

ఓరీ! నీ కేమియు పనిపాటలు లేవా? ఏమివచ్చితివి? శీఘ్రముగఁ దెల్పుము.

సేవ—అరె మహరాజ్ కు బులావ్. జా. తుంకు బులాయానీ.

కాంచ—ఓరీ! మీరాజెవరో ఎఱుంగుదువా! నే నే.

సేవ—కాంతామతి అమ్మాడు ఆయంక నే బోల్. జా.

కాంచ—సేవకా! కాంతామతి యెవ్వరు. ఆచిత్రపట మామెదేనా? ఏదీ చూతము.

సేవ—మహరాజ్ జోరు. మాలుంనీక్యా. (తనలో) తుమారా మామె మాటి ఫడేలేవ్. ఏదెఖో అమ్మాడ్. (అని చిత్రపటమిచ్చును)

కాంచ—ఆహా! ఏమి యీమె యందచందములు? భువన మోహిని యన నీమెకే చెల్లును. వరుఁడు యీమె సుందరవదనారవిందముఁ దిలకించిన ఇంక నాపై భ్రాంతివహునా? అక్కటా!

నాగతి యెయ్యది ? సేవకా! నేనుఁ దెల్పెదను లే పొమ్ము.

సేవ—ఎక్కడబోవాలమేం. జాకోటోల్ బై. సైతో అందర్కూపై జాతా.

కాంచ—సేవకా! నీవిచ్చటనే యుండుము. (పటముఁజూచి) ఔరా ! ఏమి యీసౌమ్యాకృతి. ఈపటము నిల్చిగైకొని యాతనిఁజూపిన నాకు శుభముగల్గదు. ఈపటమునఁగల కాంతామతి నేత్రమునకు నున్నపుచుక్కనిడి విరూపినిగఁజేసి చూపి "ఆడక యాడక నంధురాలినిఁ బెండ్లియాడితివా ?" యని హేళనఁ జేసెదగాక.

[నిష్క్రమించి ప్రతాపసేనునితో పునఃప్రవేశము.]

ప్రతా—ఔరా! గురుఁడెంత క్రూరచిత్తుఁడు ?

గీ. వలదు వలదన్న కృత్రిమ ♦ వాక్యములను
నాడి, యిటుచేసె గురుఁడిదే ♦ యంధురాలి
యేమిజేసిన గసిదీరు ♦ నిప్పుడతని
క్రూరచిత్తుఁడు ! మూర్ఖుఁడు! ♦ గురుఁడువాఁడె.

ప్రియకాంతా ! వాని నేమి చేయుమనెదవు ? వలదన్న బలిమిని పెండిలిజేసినాఁడు. చేసెనుపో. అంధురాలినా జేయుట. ఈ యంధురాలిని గురువుచు ఏమిసేయుమనెదవు ?

కాంచ—ఏమియు వలదు లెండు; శాంతించుఁడు.

ప్రతా—శాంతి ? ఇంకెక్కడి దా శాంతి.

కాంచ—పోనిండు. కాంతామతి రాచబిడ్డగుటచే నామెను గౌరవముగ కారాగృహమందుంచుడు. గురువగు కొండభట్టునకుముండనముగావించి ఖరముపై నెక్కించి యుత్సవముఁ జేసి దేశభ్రష్టునిగ జేయుఁడు.

ప్రతా—మంచిది. సేవకా! నీవు సత్వరముగని కాంతామతిని కారా గృహమందుంచుము గురువును దేశభ్రష్టునిఁగ జేయుము? పొమ్ము.

సేవ—మహారాజ్! మాకీ తెల్సిందిలేదు.

కాంచ—ఏమి తెలియలేదా? కాంతామతిని మొదట కొట్లో బెట్టుమని చెప్పినారు, పిమ్మట గురువును తల గొరిగించి గాడిదపై నెక్కించి యూరేగించి వెళ్ళగొట్టుమని చెప్పినారు. ఇప్పుడు తెలిసినదా?

సేవ—ఆ, (తలయూపుచు) మాకీయిప్పుడు తెలుస్తాదియేం. ముందుం దది ముసల్ల వంద్గ ఆబిక్యాహై, మహారాజ్! క్యాహుకుం?

ప్రతా—ఏమిరా! కాంచనమాల చెప్పియుండలేదా? అట్లేయొనర్పుము.

(అని యిరువురు లోనకుఁ బోవుదురు.)

సేవ—కాంతామతి అమ్మాదిక్కి భోత్ కష్టంఆయా. హాయ్, అల్లా! కాంచన్ మాలా సైతాన్ కాసీ ఁయారే? మహారాజ్ హుకుం సెయ్యాల వొద్దు. మల్లీమేం కాంచన్ మాలా మాట లిక్కియిని పెళ్ళాంగుడ్డిది అంటాసెప్తాను. కాంతామతి అమ్మాకు కాల్కిఁంది మట్కీ వస్తుందియేం కంచిస మాధర్ ఛోద్ ఢోల్క,

(నిష్క్రమించును యవనికజారును.)





శ్రీరస్తు.

# కాంతామతి.

## ద్వితీయాంకము

---

### ప్రథమరంగము కారాగృహము.

[ప్రవేశము: కాంతామతి కారాగృహములో]

(అనుబంధము ౮.)

హా! దైవమా! నేనేమి యపరాధ మొనర్చితిని? నన్నిట్లీ కారాగృహమందు నిర్బంధింపనేల? పరిణయమైనదాది నేటివఱకును నామోమైనజూడలేదే? పోనిమ్ము. నాథా! నేనపరాధినైన పుట్టినింటికిఁ బంపఁగాదా? లేకున్న నెందైన వేఱుగనుంచరాదా? తానొనర్పు కార్యముల కేమైన నడ్డుకొంటినా? వేశ్యాలోలురై, అగ్నిసాక్షిగ వివాహమాడిన నన్నుఁ గన్నులనైనఁ జూడక నిష్కారణముగ కఠిన శిక్ష విధించితిరే? అయ్యో! నేనెంత పాపురాలను? ఓ కాంచనమాలా! నీవెంతపుణ్యరాలవు? నీవైన నాయొడద యరాదా? అయ్యో! ప్రాణకాంతుఁడే యిట్టి ఘోరకార్యమునకుఁ బాల్పడ వేశ్యాంగనవగు నీకుమాత్రమేల కనికరము గల్గును? అక్కటా పూజ్యుండును, పితృసమానుండును, కులగురువును నగు కొండభట్లుగారికిఁ గూడ

నట్టిచట్ట సంభవించినది? అయ్యో! నాగ్రహచారము'

సీ. వెలకాంత నటుగూడ ♦ కులకాంతనటువీడ
యుక్తమని దోఁచెనా? ♦ వసుమతీశ!
కులగౌరవంబెల్లఁ ♦ బలుచనౌ నంచని
మదిలో దలంపవా? ♦ మనుజనాథ!
సాటివారలు విన్నఁ ♦ జాలఁజాతు రటంచుఁ
దలపోయకుంటివా? ♦ ధన్యమూర్తి!
బంధుమిత్రులమాట ♦ పాటించవైతి వ
య్యదిగాక తప్పుగా ♦ నరసితయ్య!
గీ. ఏమి యపరాధ మొనరించి ♦ తిప్పుడేను
మదికి నింతైనఁ దోఁచదో ♦ మాన్యచరిత!
తప్పులున్నను మన్నించ ♦ దగును నన్ను
రక్షణముఁ జేయవేడెద ♦ రాజమౌళి!.

అయ్యో! గౌరనోములు నోచి యెక్కుడు ఫలమురమ్మన్న వచ్చునా? నాయంటిపాపురాలు బ్రిదికి బుట్టినింటికి మెట్టినింటికిని నపయశముఁ దెచ్చుటకన్నఁ జచ్చుటమేలుగదా? హా! ప్రాణప్రియా! ప్రతాపసేనరాజేంద్రా! నన్నేలయిట్లునిర్బంధించెదవు? నాకడ నేరమున్న మీ ఖడ్గముచే ద్రుంపరాదా? మీకు సౌఖ్యమును, నాకు స్వర్గమును గల్గుగాదా?

[ప్రవేశము; సేవకుడు.]

అమ్మాడ్ బోల్ నోతే, హైతో క్యాకర్నా? మహారాజ్ హుకుం. అమ్మా! క్యాకరై. కైకురోతే. రోనుకో. ఇదిఖాచారం

కాంతా—సేవకా! నే నేమి యపరాధ మొనరించితిని? అన్నా! నీవా కాంచనమాల కడకేగి యిట్లుబల్కుము. "అమ్మా కాంచనమాలా! నాయెడ దయయుంచి ప్రాణేశ్వరునకుఁ జెప్పి నానిర్బంధవిమోచనము గావింపుము తల్లి! నీకు నేను సేవ

కావృత్తి జేసెద నీమేలు మరువజాల. నాయాభరణము లన్నియు నొసంగెద " నని దెల్పుము. పిమ్మట ఆమె దయ యెట్లుండునో?

సేవ—అమ్మా! వైసాబోలేనో మహారాజ్ ఫిర్ క్యా దండన సేస్తాడో, మైజాతానీ సలామ్కర్త.

కాంతా—అన్నా! నీకీచంద్రహారము నొసంగెద, మహారాజు వినకుండగ రహస్యముగ నాకాంచనమాలతో "మిగుల దుఃఖించుచు నిట్లు బల్కుచునె" నని నుడువుమా. తండ్రీ! నీకుపకారము నరించెద

సేవ—ఓహూథర్ చోద్ కంచన్ ఫిర్ ఓబాతానుంతా. సునోఫిర్ మహారాజ్ బోల్తానీ? పిచ్చిఅమ్మా? ఎక్కడమాటల్ సేస్తా ఫును కాంచన్ మాలాఅంటు నీకీతెల్వాదు. కొంచెల్ కొంచెల్ మింగి యేస్తాది.

కాంతా—అన్నా! అయిన బోయిరమ్ము. నాప్రాప్త మెట్లుండునో? యిదిగో! చంద్రహారముఁ గైకొనుము. (అసయిచ్చును)

సేవ—(హారముఁదీసికొని) అచ్ఛాజా తేలేవ్ అమ్మా! (పోవుచు) మంచిహారం మాకీచిక్కిందిఅండి. ఇట్టాసిక్కాల మాకీ లేక్ పోతె వదియాపాల్ జీతంమీద పెళ్లామ్కు బిడ్డలకీ ఎట్టాబతికి చ్చాల మల్లీ మేం. (నిష్క్రమించును.)

కాంతా—అయ్యో! దైవమా! తుదకు నాగతి యెట్లయినది. నాప్రాణకాంతునిఁ గనులారఁగని యెఱుంగకుండగనే యున్నదియగ చాట్లఁ బెట్టితివా? హా! నే నెంత పాపురాలను?

సీ. పతిరూపముఁజూచి ♦ యతిసమ్మదంబుతో
నుండెడి భాగ్యంబు ♦ పండదయ్యె
కాంతు సేవలొనర్చి ♦ ఘనయశంబుందెడి
పున్నెము నాకింక ♦ పుట్టదయ్యె

నాథుని వెంగట ♦ నాముచ్చటల్ జూడఁ
గోరినకోర్కె చే ♦ కూడదయ్యె
ప్రియుని ముఖముఁ జూచి ♦ ప్రీతినుంచఁగఁ జాలు
నంత యదృష్టంబు ♦ నమరదయ్యె
గీ. అక్కటా! పుట్టిపాపినో ♦ యిక్కటులిల
నందుచుంటిని కారాగృ ♦ హంబునందు
నిమ్మనఁగ నేలనయ్యా! నా ♦ బమ్మదేవ
రిట్లు నానొష్టవ్రాసె న ♦ దెట్లుగడతు.

అక్కటా! కాలమా! ఎట్టిమార్పులఁ జేసితివి. లెక్కలేని సఖీజనంబుల గలసి సంతసముగ నుండు నే నీకారాగృహమం దేకాకినై నిద్రాహారంబులు లేక దుఃఖింపవలసెనే? హా నాథా!

(మూర్ఛిల్లును యవనికజారును.)

ద్వితీయరంగము:—కాంచనమాల సౌధము.

[ప్రవేశము:—కాంచనమాల, ప్రతాపసేనుఁడు శయనించి]

(అనుబంధము 6)

కాంచ—ప్రతాపసేనుడు కీలుబొమ్మవలె నాచేఁ జిక్కినాఁడు. ఈరాజ్యమునందును, తనయందును, తనయింటియందును వేయేల? సర్వ వ్యవహారములయందును సర్వాధికారములను బొంది యీతనినొక సన్న్యాసిగఁ జేసి కూర్చుండఁబెట్టితిని. ఇంక నాకేమి కొఱంత? ఈతని ధనమంతయు లాగి నిలువఁ జేసితిని. ఈధనముచే నా సంతతివారు పదితరములవఱ కెంత వెచ్చపెట్టినను దఱుగదు. ఆహా! ధనముగడించుమార్గమున్న వేశ్యలదేకదా?

చ. విటుల గృహంబు లేర్చుకొని ♦ వేయివిధంబుల వేషభాష లం
పటులను జేసి పైఁబయిభ్ర ♦ మల్ గనుపర్చి ధనంబు సర్వముఁ

జిటికలోలాగి నిర్ధనిడు ఁనిం దగఁ జేసియు దుత్తరీయొక్కటిఁ
దిటవుగఁ జేతికిచ్చిమరి ఁ.ద్రిప్పటజూడరె? వేశ్యకాంతలుఁ.

వేశ్యకాంతలఁగూడి బాగుపడిన వాఁ డీలోకములో నెవ్వఁడుండెను? మాన్యములమ్మియు, అగ్రహారములమ్మియు, రాజ్యములమ్మియుఁ గృహములమ్మియు, వెలకాంతలకుఁ బెట్టి యెందఱు సన్యాసులు గాలేదు?

[ప్రవేశము:— సేవకుడు]

కీర్తన.

"దోసుకునే దానా—నీకీ దోసంలే దేదాంగ దానా।
దైవకటాచ్ఛం తర్లిపోతాది-ధంచునామీదకానా"

మహారాజ్! యెక్కడవుంది? (మీాదికి హాస్యముగఁ బోవుచు)

కాంచ—ఓరీ! ఏమిమాడినది. ఇట్లు పైఁబడబోచ్చెదవు?

సేవ—నైతే బోలో.

కాంచ—ఓరీ! రాజుతో నిప్పుడేమి పనిగలినది?

సేవ—సునో కాంతామతి అమ్మోడ్ భోత్ కష్టంలోవుంది, జైల్ మె రోతేహై. నీకీప్రార్థించి "జైల్కి—నాకీ యిడిపిచ్చు అమ్మా! నీకీ కాల్కి—మొక్కుతా" అని యేదుస్తావుంది, మహారాజుకి జల్ది బోలోజి. పాపం,

కాంచ—కాంతామతి తన ప్రాణేశ్వరునకుఁ జెప్పి తన కారాగృహావాసముఁ దప్పించుమనిప్రార్థించి నమస్కరించినదా? కల్ల. నమ్మజాల.

సేవ—నై అమ్మా! అంతాసత్తెం. నీతోడు మట్టితోడు. బోలు జా, రోతే అమ్మా!

కాంచ—సేవకా! నే నిదివఱకే ఆయనకు జెప్పియుంటిని. నామాట వినడయ్యె. నేనేమిచేయుదును? అనేకవిధముల బ్రతిమాలి గూడ జెప్పితిని.

సేవ—తుమారే బాతా సుంతానీ? నంగనాచిమర్యా! బోలోజా.

కాంచ—ఐన మరలఁ జెప్పెద. నీ విచ్చటనే యుండుము.

సేవ—అచ్ఛా, జావ్. (ఒకచంకకేగి నిలిచియుండును)

కాంచ—(ప్రతాపసేనుని జేరి) ప్రాణేశ్వరా! వింటిరా? దుర్మార్గురాలగు కాంతామతి మిమ్మును నన్నును మిగులనాడిపోయుచున్నదట. మీకు భార్యయగుటచే మిమ్మాడిపోసిన పోయుగాక. నన్నేల నాడిపోయవలయు? నాకును దానికిని యేమిసంబంధమున్నదని? నీభార్యచేఁ దిట్టించుటకా నన్నుఁ జేరదీసితివి? హా! ప్రాణేశ్వరా! నే నింక జీవించజాల. ఎందైన దుమికి ప్రాణములఁ బాయుదాన. నాకింక సెలవొసంగుడు. (అని యేడ్చుచు) నాథా! ఇంక నన్నువీడి నీభార్యనే కూడియుండుము. నాకును నీకును నేటితో ఋణము దీరినది.

ప్రతా—ప్రియకాంతా! దుఃఖావహము. (కంటినీరు దుడుచుచు) ఐన దాని నిప్పుడేమి సేయుమందువు?

కాంచ—(కోపముతో) ఏమిచేసెదరో నేనెఱుంగను. కనికరించి కామించినచో సరే. లేక కాననమ్మున కాలబెట్టినను సరే. ఇంక నన్నడుగకుఁడు. (పెడముఖముఁ బెట్టును.)

ప్రతా—ప్రేయసీ! ఇదంతయు నీకెవ్వరు చెప్పిరి?

కాంచ—ఎవ్వరో యననేల? సేవకుఁడే? ఇందేయున్నవాఁడు. వలయు నేని సర్వము జెప్పించెద. పిలతునా? వాని.

ప్రతా—నిజముఁ దెలిసికొందము రమ్ము.

కాంచ—వినుఁడు మీరేమియు మాటాడవలదు, సర్వము వానిచే నేనె చెప్పించెద. మీరు మారుబల్కిన కార్యముచెడును. మీయా డలుగలభీతిచే వాఁడు కొంత మారుగాగలఁడు. మీరూరకుండ వలయు. ఇందుల కంగీకరించెదరా?

చిత్రా—అంగీకరించ లేము. నీమాటకు మీరుదునా ?

కాంచ—అట్లేనరండు. (ఇరువురు ముందుకువచ్చి)

కాంచ—సేవకా! ఇటురమ్ము. కాంతామతి కారాగృహమందుండి యేడ్చుచుండుట లేదా ?

సేవ—నిజం. నిజం.

కాంచ—నీవు నాతోడఁ జెప్పినమాటలెల్ల ఆబిడ పల్కినదా లేదా? సత్యముఁ జెప్పుము.

సేవ—మాకీ అబద్ధం సెప్పాలఅని ప్యాణంమీద వచ్చింది యేం.

కాంచ—ప్రాణేశ్వరా! ప్రత్యక్షముగ వింటిరిగదా? పైనిమీయిష్టము.

చిత్రా—సేవకా! అంతయు నిజమా?

కాంచ—(చిత్రాపసేనుని చాటునకుఁబోయి చెప్పుమని సేవకునికి సైగ జేయును.)

సేవ—ఓబాబా సాచ్చి సచ్చి మహారాజ్. మాగద్దముతోడు.

చిత్రా—అట్లయిన యీదుర్మార్గురాలిని యరణ్యములపాలు జేసిరమ్ము పొమ్ము. ప్రాణేశ్వరీ! రమ్ము (అని లోనికిఁబోవును)

కాంచ—(పోవుచు)ఇప్పటికి నాకోర్కె దీరినది. ఇంతవఱకును తన భార్యమోమైనఁజూడకయే నేఁ జెప్పినట్లు జరించుచున్నాఁడు. నిజముగ నీతఁడు భార్యఁజూచియున్నచో నన్ను గారవించునా ? అందులకే నేనిట్టి పన్నుగడఁ బన్నినది. నేనాతని హృదయక్షేత్రమందు మాయాబీజము నాటుచునే యుంటిని. నేనాటిన బీజమెల్ల యంకురించి వృద్ధినొందుచునే యున్నది. ఇదియు చక్కగవృద్ధి నొందినది. వేశ్యల మర్మములు దెలియ నెవ్వారితరంబు? అరచేత వైకుంఠముఁ జూపు టెఱుంగరో?

(నిష్క్రమించుచు యవనికజారును)

సేవ—హాయ్. హాయ్. యింతమాయలుసేసి మసిపూసి పోయింది. రాజ అచ్ఛా ఆద్మిహైతో నైసాథీత్తే? మూదగ్ చోద్ కంచని కైసాబోలతే వైసాసుంతే. వున్ క్యాకరే బిరాజి. అబి క్యాహై? ముందువుంది ముసళ్ళపండగ. (నిష్క్రమించును)

తృతీయరంగము—అడవి.

[ప్రవేశము—శాంతామతి, సేవకుఁడు)

(అనుబంధము 7)

అయ్యో! తుట్టతుదకు నాగతియిట్లులయ్యె? నాకిట్టి చట్టపాటు సంభవించునని కలనైనఁ దలంతునే? మహారాష్ట్రుల సంజాతనై రాజాధిరాజ సార్వభౌముఁడగు ప్రతాపసేనరాజేంద్రునకు రాణినై రాణివాసముండుటకు మారు వనవాసమాయెనే? హా! హతవిధీ! హా! ప్రాణకాంతా! ప్రతాపసేన రాజేంద్రా!

సీ. వేశ్యమాయకు జిక్కి ♦ విటకాండ్రతోఁగూడు
బుద్ధి మీ కెవ్విధిఁ ♦ బుట్టెనయ్య!
పుట్టఁ బో గురుమాట ♦ నట్టివినియు మీరం
లరయ కేటికి పెండ్లి ♦ యాడిరయ్య!
పెండ్లియాడినదాది ♦ ప్రేమ నగ్గాడక
నెడబాసియుంట మీ ♦ కేలనయ్య!
మొడబాసిననుసరే ♦ పడరానిపాట్లకై
వనభూములకుఁబంప ♦ బాడియయ్య!
గీ. పాడియైనను పక్షమా ♦ భాగధేయ
నింద మీదికి తగదని ♦ గుండుచుంటి
వేశ్యమాటల వినవేల ♦ వెతలివేల?
మీకరాసిని తలఁడీయ ♦ మేలునాకు,

హా ! దైవమా ! నాకింక పతి సుందరవదనారవిందము జూచుభాగ్య మబ్బునా ? అది యెట్లు.

సేవ—అమ్మా ! రోసాకో. కైకు రోతే. కాంచనమాలసైతాకై సాకరే. తుమారానసీబ్ మె అల్లా వైసాలిఖే. క్యాకర్తె?

[ప్రవేశము—ఉత్తమశీలుఁడు ఒకవైపున]

ఈమె యెవ్వరైయుండును ? ఈమె రూపలావణ్యముఁ జూడ మహారాట్కుల సంజాతవలెఁ గన్పడుచున్నది. ఐన వెంటనుండిన వీని నడిగి తెలిసికొనియెద. (సేవకుని చేసైగచే బిలచి చెవులోనేమిచెప్పును)

సేవ—ఓ మాటల్ మాకీ పనికిరావు. లచ్ఛల్ లచ్ఛల్ గావాలా.

ఉత్త—సేవకా ! నీకు ద్రవ్యాపేక్షగలదేని యట్లనే యొసంగెద. ఎంత ధనమిమ్మనెదవు ?

సేవ—(చేతివ్రేళ్లుఁజూపుచు) లచ్ఛల్ లచ్ఛల్ హోనేసీ !

ఉత్త—అట్లుగాదు. ఒకలక్ష నిచ్చెద,

సేవ—హైతో జల్దీదేవ్ జాతుంహై.

ఉత్త—ఐన రమ్ము ద్రవ్యమిచ్చెద.

సేవ—జాంగి చెలో. (నిష్క్రమింతురు)

కాంతా—హా ! దైవమా ! వీరలేదియో రహస్యాలోచనఁ జేసినారు. వీరియాలోచనచే నాకేమియు ముప్పుగల్గదుగదా ?

[పునఃప్రవేశము, ఉత్తమశీలుఁడు, సేవకుఁడు]

సేవ—అమ్మా ! ఈన మహారాజ్. యీన యింటికెల్లిపో?

కాంతా—అయ్యో! సేవకా! నట్టేట ముట్టిముంచినట్లు నన్నీయువకుని కొసంగితివా ? ఇంక నాగతియేమి ?

సేవ—ఫర్వానై ఫర్వానై. రోసాకో (ఉత్తమశీలునితో) మహారాజ్ ! పితారా శిర్కొ రఘోజాతా (పెట్టెనెత్తుకొని) తల్లిబిడ్డమల్లె నూడాలమల్లీ జాతుం(బోవుచు లోపలో) మహారాజ్! భోత్ పైసా

దియ్యా. బడాసంతోషంఅయా. నిష్క్రమించును)

ఉత్త—కాంతా! రమ్ము. నాగృహమునకుఁ బోవుదము.

కాంతా—అన్నా! నీగృహంబున కేలరావలెను?

ఉత్త—లక్షరూప్యంబులిచ్చి నిన్ను కొనుక్కొంటినిగదా?

కాంతా—(తనలో) కట్టా! ఎంతఘోరము జరిగినది. ఓరీ! దుర్మార్గా! సేవకా! ఎంతకార్యమొనర్చితివిరా? (పై) అన్నా! ఇట్టి కోర్కెనుగోరక నీమార్గమున నీవుబొమ్ము.

ఉత్త—ఏమి? ద్రవ్యమిచ్చి నిన్నుంగొని నాదారిని నేనుబోవలెనా? ఎక్కడికిబోయెదవు? (అని పట్టుకొనబోవును)

(అనుబంధము 8)

కాంతా—(తప్పించుకొని)

గీ. పరునికాంతను గోరుట ♦ పాపమనుచు
తెలియఁగవా? మూర్ఖ! మదినీకు ♦ పరువుగాదు
నీదుభార్యను, సైదోండ్ల ♦ నెగడిపరులు
బట్టనెంచిన హితమౌనె? ♦ పాపి! చెనటి!

ఉత్త—లోకమోహినీ!

సీ. మానినీమణి! మోవి ♦ మధురసం బానిన
ద్రాక్షారసము వేరె ♦ ద్రావవలెనె?
చంచలాక్షిరో! నీదు ♦ చన్గవఁ బట్టిన
హేమగిరుల్ వేరె ♦ వెదుకవలెనె?
ముద్దులగుమ్మ! నీ ♦ ముఖమండలముఁజూడ
పండువెన్నెలలోన ♦ నుండవలెనె?
కలికిరో! నీమేని ♦ కాంతులఁ గనుఁగొన్న
కాంచనలతలను ♦ గాంచవలెనె?

గీ. అంబుజాక్షిరో! నీయూరు ♦ బాంధవులను
జూడ వారంభకరువులఁ ♦ జూడవలెనె?
కుందరదన! మీదటనిన్నుఁ ♦ గూడియుండు
సౌఖ్యమునమించునదె స్వర్గ ♦ సౌఖ్యమైన.

తరుణీ! ఇంక జాగొనరించక నామనోరథముఁ దీర్పుము. (పట్టుకొన బోవును.)

కాంతా—(తనలో) అయ్యో! దైవమా! ఇంక నేనేమి సేయుదాన? ఏడు కామాతురుండై నన్నుఁబట్ట సాహసించెనే? (పై) అన్నా! నామనవి వినుము. పరనారులఁ గోరుటపాతకంబు కాదా? మఱియు రక్తమాంసభూయిష్ఠంబగు నీతనువును వేవిధంబుల గౌరవ వస్తువనితివో సరిఁబోల్చి వర్ణింపఁగాదవు. బుద్ధిమంతుఁడవగు నీకిది చెల్లునా? నేనొకటిఁ జెప్పెదవినుము.

సీ. బంగరు కలశముల్ ♦ పాలిండ్లటనియందు
దుర్మాంసయుతమైన ♦ తుండ్లు కావె?
సరసిజాతములు కో ♦ చనములటందురు
పుసిగారు ముఖములో ♦ పుండ్లుగావె
బింబఫలంబులే ♦ పెదవియంచనియందు
దిగువనెత్తురుకోలు ♦ తిత్తిగాదె?
హార్యతనమున కౌన ♦ టంచని యందురు
నడయూడు నన్నసి ♦ నరముగాదె?

గీ. శుకపికధ్వనులందురు వ ♦ చోరచనల
నత్తులోనుండి గూసెడు ♦ గుత్తుగాదె?
మేల్మిబంగరు నిగ్గని ♦ మెచ్చుకొందు
రయ్యయో! యిదిమాయకా ♦ యమ్ముగాదె?

అన్నా! నీకునునాయట్టిలోఁబుట్టువు లుండియేయుండిరి. వారివలె

నన్నుంజూచుము. నీకునమస్కరించెద. నాయెడ సోదరీవాత్సల్యముంచి నన్ను విడిపొమ్ము. చెరుగొడ్డివేడెద.

(అని పెడముఖముఁబెట్టును)

ఉత్త—తల్లీ! సుగుణవల్లీ! నీవు చెప్పిన నీతిచే నాకుఁ బుద్ధివచ్చినది, నేటినుండియు నిట్టి దుర్బుద్ధిమాని పరసతులఁ దల్లులుగ నెంచి మెలంగెద. ఇంక నాపై నేరముంచక క్షమింపుము,

(అని కాళ్లపైఁ బడును.)

కాంత—అన్నా! లెమ్ము నీకు శుభమగుఁగాక.

ఉత్త—తల్లీ! ఒక్కమనవి. నీపై భ్రాంతిచే ద్రవ్యమంతయుఁ గోల్పోతి నిందులకేమి సెలవు?

కాంత—అయ్యా! నీధనమంతయు పోయెనని చింతింపకుము. నీధనమునకుఁ బదిరెట్లెక్కుడగు నొకయంగుళీయకము నాకడఁ గలదు. దానిని నీకొసంగెదఁ గైకొని నీఋణవిముక్తిఁ జేసికొనుము. ఇదిగో! (అని పెడముఖముతో నిచ్చును.)

ఉత్త—(తీసికొని)! అమ్మా! ఇదినాకడఁ జెల్లునా? దీని నింతవెలకెవ రంగీకరించి స్వీకరింతురు?

కాంత—అయ్యా! సందియమేల? రాజాధిరాజులు గ్రహింతురు.

ఉత్త—అట్లయిన నీ యుంగరము రొక్కమాయక మగువటకు నీ పట్టణమునంగలసత్రమందుండుము. నే దీని విక్రయించుకొని వచ్చెద, నీకేమియు భయములేదు. పోవుదమురమ్ము.

(నిష్క్రమించును)

కాంత—(పోవుచు) దైవమా! ఇంక నా కెట్టియాపదఁ గల్గఁజేయ నెంచితివి? సర్వేశ్వరా! సర్వమునకును భారకర్తవు నీవని నమ్మియుంటిని. తుదకెట్లు జేసినను సరే. (అనినిష్క్రమించును,

(యవనికజారును.)



# కాంతామతి.

శ్రీ

## తృతీయాంకము

---

ప్రథమరంగము-మహాపాతకపురములో దుర్బుద్ధియాస్థానము.

[ప్రవేశము: దుర్బుద్ధి అనృతవాది, మహాపాపి అమాత్యమంత్రులు]

దుర్బు —

ఉ. శూరదనంపుఁ జేష్టలకు ♦ గోవిశుఁడీతఁడటంచు లోకుల
య్యారె! నుతించుచుండ్రి మరి ♦ యాదగ నీ భువనంబులెల్ల నా
పేరువినంగ బెగ్గడిలు ♦ బెబ్బులి పోలిక నడ్డులేక న
వ్వారిగ రాజ్యపాలనము ♦ వాంఛదలిర్పఁగఁ జేయుచుంటిగా.

సచివవరా! అనృతవాదీ! ప్రజలేమనుచుండిరి?

అనృ—నోరెత్తుటకు వీలున్నదా? మీయాజ్ఞచొప్పున ప్రజల నందఱి సాధించి, వేధించి, బాధించుచుంటి. మీశాసనం బతిక్రమించ నే నెంతవాఁడను? ఇది రాజశాసనముగదా?

దుర్బు—అనృతవాదీ! నీయట్టి సచివపుంగవుడు గల్గ నాకేమికొఱంత? ఉండిన నీయట్టి మంత్రియే యుండవలయును.

అనృ—చిత్తము! అంతయు తమయాజ్ఞయేగదా?

దుర్బు—మహాపాపీ! నీకార్యములెల్ల వెనుదీయక ప్రధానముగ నెంచి యాచరించుచుంటివా?

మహా—ఇట్టివిషయము నాకు మీరు దెల్పవలెనా? నా నామధేయమే నేనొనరించిన కార్యములఁ దెల్పునుగదా?

దుర్బు—నిండా సంతోషమైనది. మరచితిని. కులకాంతలబట్టి వెలకాంతలవలె నిర్బధించుచుంటివా?

మహా—నిర్బంధించుటయగాదు, నన్నుంగాంచిన నారీమణులు బర్వులెత్తి యేమూలలనో దాగుచుందురు. అట్టివారింబట్టి వెలికీడ్చి నా యిచ్చవచ్చినట్లొనర్చుచుంటిని. అందుచే ప్రజలెల్లరు నన్నుం జూచి పై కేమియు ననఁజాలక లోలోన నేమేమో యాడిపోసికొనుచుందురు. కాని నేనన్న ప్రతివారికి గుండెదిగులు ప్రాణతల్లటముగ నేయున్నది.

దుర్బు—భదివచంద్రా! నీవుగదా యీదుర్బుద్ధి మహారాజునకు మితిలేని యానంద మొసఁగ జేయుచుంటివి. మంత్రియన నిట్లుండవలయు.

మహా—ఇదంతయు తమ కరుణయేగదా?

దుర్బు—మంచిది.

[ప్రవేశము సేవకుఁడు.]

మహారాజా! యెవ్వఁడో యొక వర్తకుడట. తమ్ము దర్శింపవచ్చియున్నవాడు సెలవా?

దుర్బు—మంచిది. ప్రవేశపెట్టుము.

[సేవకుఁడు నిష్క్రమించి, పునఃప్రవేశము ఉత్తమశీలునితో]

ఉత్త—మహారాజా! వందనము. (నమస్కరించును.)

దుర్బు—ఓయీ! నీ వెవ్వఁడవు? ఏమి కార్యార్థమై వచ్చితివి?

ఉత్త—నాకడనొక యంగుళీయకముగలదు, దాని రొక్కముగ మార్చుకొనవచ్చితిని. మీకు వలయునేని దీనిఁ గ్రహించి ద్రవ్యమొసంగుడు. (అని యిచ్చును)

దుర్బు—(తీసికొని చూచి) శేరీ! ఇది నీకెచ్చట లభించినది? స్త్రీలు ధరించుదానివలె గన్పడుచున్నదే? దీని నెందైనదస్కరించితివా?

ఉత్త—ఆర్యా! ఇదేమిన్యాయము. ఇది నాసొత్తుగదా? మీరిట్లు బల్కుట న్యాయమా?

దుర్బు—న్యాయమో అన్యాయమో? నిక్కముఁ దెల్పుము. లేకున్న శిక్షింపఁబడుదువు.

ఉత్త—(తనలో) ఈపరిపాలనము దుష్టబుద్ధియన్న పేరునకుఁ దగియే యున్నది. (ప్రి) తెల్పెదవినుఁడు,

దుర్బు—తెల్పుము. నామ్రోల బుద్ధిగల్గి ప్రవర్తించుము,

ఉత్త—మీరు పల్కినది నిజమేయగు. నీయుంగుళీయక మొకరాచకన్నియది. ఆబిడ దీని విక్రయించుకొనిరమ్మన వచ్చితిని.

దుర్బు—ఆస్త్రీ యిప్పు డెందున్నది?

ఉత్త—ఈపురమునంగల సత్రమం దుండినది.

దుర్బు—అట్లయిన నాబిడను నాకడకుఁ దోడ్కొనిరమ్ము?

ఉత్త—చిత్తము. (నిష్క్రమించును.)

దుర్బు—మంత్రులారా! ఆరాచకన్నె నెట్లైన గూడవలయును గాన మీరు సమయోచిత మెఱింగి సంచరింపుఁడు.

[పునఃప్రవేశము ఉత్తమశీలుఁడు కాంతామతితో]

దుర్బు—

ఉ. చక్కనిచుక్క యీవికచ ♦ సారసనేత్రి యెవాని కాంతయో?
చుక్కలఱేని భామినియొ? ♦ సూటిగ మారునిరాణియో? అహా!
నిక్క మెఱుంగలేనయితి ♦ సీటును గోటునుఁ జూడఁ జిత్తముగా
జిక్కులపాల్పడెఁ బిదపఁ ♦ జేసెడికార్యము దోచదాయెగా?

కాంతా—ఈ యంగుళీయక మెవరిది?

కాంతా—(తలవంచి) నాదియే,

దుర్బు—మంచిది. మంత్రిలారా! ఈమె రాచకన్నెగా గన్పడుచున్నది. ఈమె యీస్థానమందుండతగదు. కావున యంతిపురంబునకు గైకొనిపొండు.

మంత్రిలు—చిత్తము. (కాంతామతితో నిష్క్రమించును.)

దుర్బు—ఓరీ! ఇంక నీదారిని నీవు పొమ్ము.

ఉత్త—అయ్యో! ఇదెక్కడి న్యాయము? ధనమియ్యకయు నుంగరమియకయుఁ బొమ్మనుట?

దుర్బు—ఇంక నాకడ నధికముగ పేలకపొమ్ము.

ఉత్త—అట్లయిన నాయుంగరమొసంగుడు పోయెద.

దుర్బు—పోయెదవా లేదా? లేకున్న కారాగృహమందుంచెద. ఎవడురా?

[ప్రవేశము. సేవకుఁడు]

దేవా సెలవు?

దుర్బు-నీవీదుష్టునిమనపురమునందుండకుండునట్లావలకుఁబారద్రోలుము.

ఉత్త—(తనలో) ఔరా! ఎంతన్యాయపరిపాలనము. ఈపట్టణమంతయు నిట్లనేయుండుఁగాబోలు.

సేవ—ఏదియో గొణుగుచుంటివి. ఏమది? ఇందుండి తరలిపొమ్ము.

ఉత్త—పోయెదగాని సేవకా! నీపేరేమి?

సేవ—నాపేరా? మహానీచుఁడు.

ఉత్త—(తనలో) మంచి నామధేయమే. మీరాజునకు, రాజ్యమునకు పరిపాలనకుఁ దగియే యున్నది.

సేవ—అధికముగా వాగక పోయెదవా లేదా? (అని నెట్టును.)

ఉత్త—(తనలో) ఇంతటి మహాన్యాయ పరిపాలన మెందునుగానము. "వినాశకాలే విపరీతబుద్ధిః" యనునట్లు రాజులకు వినాశకాలమాసన్నమైన విపరీత బుద్ధులు గల్గును. (నిష్క్రమించును.)

దుర్బు—సేవకా ! నీవనిమీద బొమ్ము. (సేవకుఁడు నిష్క్రమించును)
నేనింక జాగుసేయక నాయంతిపురమునకుఁ బంపిన యాకాంత
తో గూడి రతిరాజసుఖము లనుభవించెద గాక.

(నిష్క్రమించును. యవనికజారును)

---

ద్వితీయరంగము—అంతఃపురము.

[ప్రవేశము—దుర్బుద్ధి, కాంతామతి.]

దుర్బు—లక్ష్మీ ! పలుకవేమి ? నాపై యలుకా?

ఉ. కోపమదేలనే ? యమిత ♦ కోరికతో నిను వేడుచుంటి నం
తాపము, దీర్పవో ప్రియమిక ♦ తాళఁగఁజాలనె మందయాన! నా
ప్రాపుకుఁ జేరవేమి ? మధురంబగు పల్కులు పల్కవేమి ? నే
పాపము జేసినాడనె ? కృ ♦ పామతి సన్నగ తీర్పు వేగమే.

కాంతా—(నిరుత్తరయగును.)

దుర్బు—కాంతా ! ఎంతబిలచినను బలుకవు ? ప్రత్యుత్తరమీయవు?
కాను! మంచిమాటలకు మామిడికాయలు రాలునా? నిన్నింక
బలిమిని బట్టుటయే యుచితము.

కాంతా—(తలవంచుకొని) అన్నా ! నే నన్నోవిధములఁ బ్రతిమాలు
చుంటినే? కనికరము లేదా ? నీ తో బుట్టువునని తెల్పితినే ?
ఇంక నీమాధ్యము వీడవే ? కట్టా! యేమిగతి?

దుర్బు—రామామణీ! నన్నేల బ్రతిమాలెదవు? నీవు బ్రతిమాలినం
తనే మిన్నకుందు ననుకొంటివా?? అదికల్ల. ఈదుర్బుద్ధిమహా
రాజు గుణగణంబు లెఱుంగక మాటలాడెద వేమి ?

కాంతా—అన్నా యని యెన్నోవిధములఁ బ్రతిమాలినను నీబుద్ధి మరల
కున్నదే? నీవు క్షత్రియుండవుకావా ? క్షత్రియ ధర్మము

లేటుంగదా? నీకుఁ దోఁబుట్టువులు లేరా? నీభార్య నెవ్వడేని నిర్బంధించ నీకు సమ్మతమగునా? నీచా! ఇంక నీ దుర్బుద్ధి మానిసన్మార్గము ననుసరింపుము,

దుర్బు—కలికీ! నీవెన్ని విరసోక్తులాడినను సమ్మతమేకాని నీవు నా మరుసంతాపముఁ దీర్చి నన్నానందింప జేయువఱకు నిన్ను విడువను.

కాంతా—ఓరీ! నీరాజ్యమందందఱు నిట్టివారలేయుండిరా? నీతినుప దేశించువారలు లేరా? ఒకవేళ యుండినను వారి యుపదేశము నీకు విషమయ్యెనా?

మత్తకోకిల

దుర్బు—మారుబారికి నోర్వలేనిక ♦ మాటలేటికి? మానినీ!
ధీరుఁడీ దుర్బుద్ధియంచును ♦ ధీమతిగ నను గూడుమీ

కాంతా—ధీరబుద్ధిగలార లన్యుల ♦ స్త్రీలగోరుదురే? ఖలా!
ఘోరపాపంబనుచు మదిలో ♦ గొంకవేలర? మూర్ఖుఁడా!

దుర్బు—పాపమెట్టిదో దెల్పవే మృదు ♦ పాటలాధరి! వేగమే
రోపమెలను బాగుసేయక ♦ కోర్కె దీర్పవె కామినీ!

కాంతా—పాపమెట్టిదో దెల్పవలెనా? ♦ పాపుడా మరి నీవెనా
పాపు జేరకు దవ్వునుండుము ♦ బాడిగాదిది నీచుడా!

దుర్బు—కాంతామణీ! పాపమనునది గలదా? పరాంగనలఁ గూడిన పరువుబోవునా?

సీ. పరనారులను గూడు ♦ పాకాసుర విరోధి
సురగణంబుల యందు ♦ పరువుచెడెనె?

కాం—పరనారి యాహల్య ♦ భామఁగోరి యతండు
పడరాని యిక్కట్లు ♦ బడఁగలేదె?

దుర్బు—తారతోఁగూడిన ♦ తారాపతికి యేమి
లోపంబు గలెనే ♦ లోలనేత్రి ;
కాం—తారతోఁగూడిన ♦ తారేశు గనలేదె
కళలు క్రియంబుగాఁ ♦ దరిగియుంట
దుర్బు—రాధతో స్నేహంబు ♦ రహినల్పు శ్రీకృష్ణు
నాదిదేవుండని ♦ యనగలేదె ?
కాం—రాధతో స్నేహంబు ♦ రమణ నల్పినకృష్ణుఁ
డోలగంబున చేలు ♦ పాలుగాడె?
దుర్బు—గీ. ఏల నీకథలెల్లను ♦ చాలుచాలు
నాదు కోరికదీర్పవే ♦ నళినవయన!
కాంతా—చాలు చాలింక బుద్ధినీ ♦ కేల లేదు?
అరయ నఘోర నిరయముల ♦ నందగలవు.
దుర్బు—మిటారీ! నేనింక నిలువజాల, (అనిచెయ్యి పట్టుకొనబోవును)
[అనుబంధము 9]
కాంతా—(తనలో) వీని బారినుండి యెట్లైన కపటోపాయంబుచే
దప్పించుకొనవలెను. (ప్ర) రాజా! తొందరొందకుము.
దుర్బు—కామినీ! ఏమది. తెలియబల్కుము?
కాంతా—తెల్పుటకుఁ గొంచెము సందియముగలిగినో రాడుటలేదు.
దుర్బు—సందియ మక్కరలేదు. సర్వమును దెల్పుము.
కాంతా—నే నెంతకాలము నుండియో యిట్లుగా దిమ్మరుచుంటిని.
దుర్బు—ఎందులకు ?
కాంతా—నామదికి నచ్చిన పురుషు డెందు దొరకునో యని,
దుర్బు—నీమదికి నే నచ్చియుండలేదా?
కాంతా—ఆ. నచ్చలేదు.
దుర్బు—నచ్చియే యుంటిని గదా? ఏల నింతరాద్ధాంతము జరిపితివి.

కాంతా—నాయెడ నీకు ననురాగము కలదో లేదో యని యట్లు జరిపితి.
దుర్బు—ఎంతమాట? లేకేమి. నీవెట్లొనరింపుమన్న నట్లొనరింపనా?
కాంతా—అట్లయిన నిన్నే వరించదలచితిని.
దుర్బు—ముమ్మాటికి నిజమే వరించుట ?
కాంతా—ఊఁ. అందుకే మరి వచ్చినది.
దుర్బు—అటులైన జాలమేల? రమ్ము యంతిపురంబునకు.
కాంతా—(తనలో) ఎట్లయిన వీనిని నమ్మించి యావలకు దాటవలెను. (ప్రి) పిచ్చిరాజా! అప్పుడే యంతిపురంబునకా? ఇల్లలికి ముగ్గుపెట్టిన మాత్రమున పండుగ వచ్చునా?
దుర్బు—ఇంకేమి యాటంకము గలదో నుడువరాదా ?
కాంతా—నీక్షేమముఁ గోరి దెల్పుచుంటిని. నీ వంగీకరించిన నీకుఁ దక్కుదును.
దుర్బు—నాక్షేమముఁ గోరియే దెల్పుచుంటివా ?
కాంతా—ఊఁ, అదేమరి.
దుర్బు—ఐన జాగేల? త్వరముగఁ దెల్పుము,
కాంతా—వినుము. నాకొక వ్రతము కలదు.
దుర్బు—అది నాకడనే దీర్చుకొనరాదా?
కాంతా—అది దీర్చిన నీకోర్కెయే దీరగలదు.
దుర్బు—ఏమది తెల్పుము.
కాంతా—అది గౌరీవ్రతము.
దుర్బు—ఆవ్రతమున కేమిగావలయును?
కాంతా—ఇందులకా? లెక్కలేని ధనవ్యయము కాగలదు.
దుర్బు—అందులకు నాకు సమ్మతమేయగు. ఇంతియేగదా? మరేమియు లేదు గదా ?

కాంతా—లేకేమి? మరొకటి పెద్దనియమమే గలదు.

దుర్బు—అంత పెద్దనియమమేమి? అదియుఁ దెల్పుము.

కాంతా—వినుము. నాకొక సౌధము నిర్మింపవలయును. అందు నారు మాసముల నారుదినంబులు గౌరినే పూజింపవలయును. అందుల కనేక దానము లొనర్పవలయు. అందులకుఁ దగినధనము వలయు నప్పుడెల్లఁ బంపుచుండవలెను.

దుర్బు—గీ. ఇంతకాలము గడువీయ ♦ నెట్టులోర్తు?
కొద్దికాలంబుగా మార్పు ♦ కొనకయున్న
నేను జీవింతుననుమాట ♦ మాని వేడ్క-
మదిని యోజించుకొనుమింక ♦ మందగమన!

అబ్బా! ఆరుమాసముల యారురోజులే? అంతవఱకు నేను నిలువ గలనా? పోనిమ్ము; ఆరుమాసములు వీడి యారురోజులే చేయరాదా?

కాంతా—అట్లొనర్చుటకు వలనుపడదు. తొలుత, నీయట్టి పురుష శ్రేష్ఠుడును, రాజకులాభరణమును దొరకునాయని యట్లొనర్చితిని. కాని నీవింత శీఘ్రముగ నాకుఁ జిక్కుదువనిదలంచనైతి. అయ్యో! ఏమి నాబుద్ధిమాంద్యము. అప్పుడు నాకింత జ్ఞానముండిన యిట్లొనర్చనుగదా?

దుర్బు—ఎట్లో ప్రాణము నిల్పుకొందునులే.

కాంతా—మరొకటి మరచితిని.

దుర్బు—ఏమది?

కాంతా—నావ్రతము సమాప్తమగువఱకును నీవుగాని నీసేవకులుగాని నావ్రతాలయముకడకు రావలనుపడదు.

దుర్బు—అయ్యో! ఏమిది నిన్ను జూచియైనఁ బ్రాణములు నిల్పుకొంద మనుకొంటినే?

కాంతా—నీయాపదను నాకన్నుల కగపడరాదు. నీశబ్దము నాచెవులకు వినఁబడరాదు. అట్లుగాక తప్పిచరించితివేని శిరము ఛేదింపఁగ య్యాలె చత్తువు. (కొంచెమాగి) అయ్యో! రాజా! నీవుచచ్చిన నాకింక దిక్కెవ్వరు? ముందు నాగతి యెట్లున్నదో కదా? నీప్రే మమును నాసౌఖ్యమును గూర్చి చెప్పితిని.

దుర్బు—ఓహో! నాప్రేమమునుగూర్చియే సర్వము దాచక చెప్పితివా?

కాంతా—ఊ. అందుకేమది.

దుర్బు.—అటులైన రమ్ము పోవుదము. (వెంటనంటును.)

కాంతా—దూరముననుండుము, దూరముననుండుము. ముందు నీవు సాగుము.

దుర్బు—రమ్ము. (ముందుపోవును)

కాంతా—(వెంట పోవును.) (యవనికజారును)

---

(తృతీయరంగము:—కాంచనమాల సౌధము.

[ప్రవేశము—కాంచనమాల.]

అహా! మోహమెంత పాడుది. తన శరీరము తన నెఱుంగకుండ జేయునుగదా? నా యందచందములఁజూచి రాజాధిరాజగు ప్రతాపసే నుఁడు నన్నుంగూడి ధనమెల్ల గొల్లపెట్టినాడు. ఒక్కధనమేమి? రాజ్య మంతయుఁ గోల్పోయి తుదకు నిలువ నీడలేక, కుడువఁ గూడులేక హాహాకారవమెత్తి చరించుచుండ, ఔరా! వారకాంత పొందెంత ధనాధి పునైనను, ధనహీనునిగఁజేసి పడరానిక్రిమలఁ బాలొనరించునుగదా? ప్రతాపసేనా! నీవు నాచెంతకుఁ జేరునప్పుడెంత గౌరవముగనుంటివి? పిమ్మట నాకు దాసుఁడవై పెద్దలవాక్యముల వినక రాజ్యమును, భార్య ను గోల్పోతివే? ఇందులకు నేనేగదా కారణము? ఛీ! నేనెంతపాపు రాలను! ఓ ప్రతాపసేనా!

సీ. రాజ్యమును జూచి ♦ నన్ను వీడకగదా?
గురునాజ్ఞ మీరిట్లు ♦ గులికినావు
నాయావనము జూచి ♦ నన్నువద్దిరాగదా?
భార్యను వనముకు ♦ బంపినావు
తుచ్ఛసుఖంబంచు ♦ నిచ్చయించక గదా?
కులగౌరవము మంట ♦ గలిపినావు
నృత్యగీతములను ♦ నిత్యంబు వినిగదా?
మేనుమఱచి నీవు ♦ మెలఁగినావు
గీ. రాజ్యపాలన మంతయు ♦ రగులఁబెట్టి
ప్రజల సౌఖ్యంబు లెల్లను ♦ పాడుచేసి
వాదుచెంతకు జేరితే ♦ నమ్మి తకట!
వేశ్యలతోఁ బొందు విటులకు ♦ వెతలుగావె.

నే వగవనేల? బుద్ధిహీనులై విటకాంద్రు మా గుమ్మములదరిఁ జేరి మమ్ము ప్రార్థింప మేమేమి సేయఁగలము? అంతయు విటులదే లోపము. మేము వారలఁ బ్రార్థించితిమా? మా గృహంబు లలంకరించుమంటి మా? తల్లిదండ్రులమాటలు నరకుచేయక సోమరులై, చదువుసంధ్యల మాని త్రాగుబోతులై, మా వేశ్యల వాడఁ జేరి సర్వముఁ గోల్పోవు చుండిరి. ఇందులకు మే మేమి సేయఁగలము? మా దేమిలోపము?

(నిష్క్రమించును.)

[ప్రవేశము:—ప్రతాపసేనుఁడు ఒకవైపునుండి]

ఓరా! కాంచనమాలా! ఎంత చేసితివే?

ఉ. కూడును నీళ్ళులేకఁ గను ♦ కూరికి నేటికి దూడువాలుకే
జాడనుబోదు వేశ్యనిట ♦ సాదము గొంచెము బెట్టుమంచు నే
వేడద నిర్వాదానభయ ♦ వేయదె బోనము పొట్టనిండ, మీ
మోడకబోదు పూర్వవిధ ♦ మాచరితో మరి సానియింటికిన్॥

ఆహా! సర్వస్వమును కాంచనమాలకు ధారవోసితి. అన్నపానీయంబులకు దూరమైతి. కులాంగనను గోల్పోయితి. సాధుజనంబులకుఁ బగవాఁడనైతి. స్త్రీజనులకు తృణప్రాయుఁడనైతి. కట్టా! తుదకు నేను మూడుదినములనుండియు యింత కూడుదొరకక క్షుద్బాధచే మిగుల గాసిల్లుచు కృశియించియుంటిని. పూర్వపరిచితురాలగు నా కాంచనమాలయైన యింత కబళముఁ బెట్టకుండునా? యని నమ్మివచ్చితి. ఆమెయు నేమనునో? ఏమి నా వెఱ్ఱి? కాలముదీరినను, ధనహీనతసమయమునను, స్నేహితులుందురా? గౌరవముండునా? తుదకు కడజాతివాఁడు సైతము తనకన్న హీనునిగఁ జూచును, ఇంత యేల? కాంచనమాలను బిలిచెదఁ గాక. (తలుపుతట్టుచు) కాంచనమాలా! కాంచనమాలా!

(ప్రవేశము—కాంచనమాల ఒకవైపునుండి)

ఎవ్వఁడవు నీవు? కాంచనమాలాయని ఖండితముగ బిలుచుచుంటివి. నీ వెవ్వఁడవు?

ప్రీతా—కాంచనమాలా! ఇంతలోనే మరచితివా ?

కాంచ—ఎవ్వఁడవో తెలియంగదు. అవలకుఁ బొమ్ము.

ప్రీతా—కాంచనమాలా! మనవి.

గీ. కూడు దిసి నేటికిని నేను ♦ మూడునాళ్లు
లెందు దొరకక గుళ్లంబు ♦ లిండ్లఁ జేరి
వేడుచుంటిని పట్టెడు ♦ వేయవమ్మ
మానినీమణి! కాంచన ♦ మాల! నాకు.

కాంచనమాలా! ప్రాణములు పోవుచున్నవి. అంతప్రసాద మొసగితివేని దానినోటనిడుకొని నాత్రోవను నేను పోయెదను. పూర్వస్నేహమైన దలపుమా?

కాంచ—బుద్ధిహీనుడా! నీవు నాకు పూర్వస్నేహితుడవా? నోరు

మూసికొనుము. ఈతూరిట్లు భాషించిన తగిన బుద్ధిఁ జెప్పించెద. పొమ్ము. పాదములేదు గీదములేదు. (అని లోనికిఁ బోవును)

వ్రతా—అక్కటా! వ్రతావసేనుఁడ నీవేశ్యాస్నేహమువలన నట్టిగతిఁ గల్గినది. తుదకు నొక్కమెతుకైనదొరకక క్షుద్బాధచేఁ గుంది ప్రాణములు వీడవలసెనే! హా! దైవమా! ఎంతనిర్భాగ్యుఁడ.

సీ. తండ్రితద్దినమైనఁ ♦ దలఁచక మదిలోన
వెలకాంత చెంగట ♦ మెలఁగినాఁడ
భార్యసౌందర్యంబు ♦ భావమందెంచక
వేశ్యకాంతకుఁ జిక్కి ♦ వెలసినాఁడ
కులగౌరవమునంత ♦ గోల్పోవుచుండఁగ
భోగకాంతకు సేవ ♦ బూనినాఁడ
రాజ్యమందుఁ బ్రజల ♦ రాయిడులరయక
పణ్యాంగనాగృహాన ♦ పండినాఁడ
గీ. యింతకును బుద్ధిలేక రో ♦ యింతిచెంతఁ
జేరి నే నిట్టికష్టముల్ ♦ దీరిపోవ
కుండునట్టుగఁ జేసుక ♦ మండినాఁడ
వేశ్యలను గూడువారికి ♦ వెతలివియొకో ?

ఓ భారతీయులారా ! సోదరులగు నో విటులారా ! ఇదియంతయు నా యనుభవముచే నుగ్గడింపుచుంటి.

సీ. ధనమంతయును లాగి ♦ తన సేవకునిఁ జేసె
వెలకాంత పొందింక ♦ వలదువలదు
రాజ్యమంతయుమాపె ♦ రాజను మొదబాపె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు
పట్టెడన్నమదెందు ♦ పుట్టకుండఁగఁ జేసె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు
సన్యాసివేషంబు ♦ నన్యాయముగ వేసె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు

గీ. వేశ్య కాంతను గూడ నీ ♦ వెతలు నాకు
వచ్చిచేరెను గటకటా ! ♦ నిశ్చయముగ
సుగుణధనులార ! భారత ♦ శూరులార
పోకుఁడింకను వేశ్యల ♦ పొందుకొఱకు.

మఱియు,

మ. వెలకాంతల్ గపటంపుఁబ్రేమ నహహా! ♦ వేల్వేలుద్రవ్యంబు లి
య్యల బెన్వేసియులాగి భిక్షుకుని గా ♦ సింతైన లేకుండఁగన్
యిలువాకిండ్లను నమ్మఁజేతు రకటా! ♦ యిస్సీ ♦ మహాశూరులా
వెలయాండ్రన్ మరిగూడదింక యనుచున్ ♦ వేనోళ్ళఁబ్రార్థించెదన్.

ఉ. గానకళాదులన్ గనియు ♦ కామము నెత్తికియెక్కి యెక్కుడా
మానము మంటగల్పి మతి ♦ మాంద్యుఁడనై చరియించినాఁడ యా
మానిని వేశ్యకాంత యను ♦ మానము లేకను జేసె భిక్షుకున్
మానిత రాజ్యలక్ష్మి! ప్రియ ♦ మానిని ! గోల్పడినాఁడ దైవమా!

గీ. చిచ్చుకొంపకు నిడికొని ♦ చింతనొంద
ఫలముగల్గునె ? పుడమిలో ♦ భవ్యులార
గల్గె యుంపుడుకత్తెచే ♦ గష్టము లిటు
మీరలైనను సద్బుద్ధి ♦ మెలఁగుడింక.

సర్వముఁగోల్పోయిన నేనెంత నీతిజెప్పినను ఏమిలాభము ? తొలుత నాగురుఁడు నాకెంతయో నీతిబోధించలేదా ? నేనద్దానిని వింటినా ? పాపమా గురూత్తముని సైతము ప్రల్లదంబులఁబల్కినది వేశ్యమాటలు వినియేగదా ? రాజ్యమందుఁగూడ నిల్వనీయక పరదేశములకుఁ బారదోలినది. ఇట్టి గురుద్రోహినగు నాకిదియే శిక్ష,

(అనుబంధము 10)

నేనింక నా ప్రాణకాంతయగు కాంతామతిని కాంతారమందు వెనుకుచు ఈ సన్యాసి వేషమునఁ దిరిగెదగాక. (నిష్క్రమించును.)

[పునఃప్రవేశము—కాంచనమాల.]

ఎట్టిపండితునైనను, ఎట్టివీరునైనను, ఎట్టిధనికునైనను, మోహము పదదానునిగ జేయునుగదా ? అహా ! మోహమెంత చెడ్డది ? ఈపుడమియందు వారాంగనలకులమువంటి నీచకులమును, వారివృత్తియంతనీచవృత్తియు నేకులమందును లేదు. దైవము మమ్మును ఒక్కరి కగృహిణులగాఁ జేయక పలువురికేల జేయవలెను ? ఇట్టి మా వారాంగన లెందఱనో జోగులఁజేసి పదరాని నిందల పాల్పడుచుండిరి, కానాను! ఇందు మా వేశ్యల లోపమేమున్నది? అంతయుఁ బురుషుల దే లోపము. ఏమన పితార్జితములగు మడిమాన్యములన్ని మాకొసంగుమని వేశ్యలు విటులను బాధించిరా ? ఇపుడు మా వేశ్యాకులమందు గూడ సంఘములస్థాపించి వ్యభిచారవృత్తిఁ బారద్రోలవలయునని పాటు పడుచుండిరి, చాలవఱకు సంఘ మభివృద్ధిలోనే యున్నది, ఇప్పుడు వ్యభిచారదేవత నావాట కుంది కృశించి క్షీణదశ నందుచున్నది. వ్యభిచారమన్న మాకులమందున నేగాని మరి యేకులమందును లేకుండె. ఇపుడన్న సర్వకులములయందునుగలదు. శ్రీమంతులైనవారు నిదే చేయుచుండిరి, వారికిఁగట్ట బట్టయుఁ దిన మెతుకును లేదా ? ఓ భారతీయ సోదరీమణులారా ! వారకాంతలారా ! నామనవి వినుఁడు.

సీ. అతనమ్మి దొరకక ♦ వెసమానమును నమ్మి
కాలంబు గడపెడి కాంతలార !
అర్థమ్ముకై మహా ♦ యాశ జెందుచునుండి
పరులకూటమిఁగోరు ♦ పడఁతులార

తుచ్ఛసుఖముఁగోరి ♦ దోషమెంచక విటు
లనుగూడి సుఖయించు ♦ లలనలార!
రోగినైననుసరే ♦ భోగింపదల్చుక
చూచుచుండెడి తుచ్ఛ ♦ సుదతులార!

గీ. పాపభూయిష్ఠమైన యీ ♦ పాడువృత్తి
విడిచిపెట్టుమటంచు నే ♦ వేయిగతుల
వేడుచుంటిని ప్రియులార ♦ వెలఁదులార!
భరతభవులార! మణులార ♦ భామలార!

ఇట్టి వ్యభిచారవృత్తివలననే పరదేశవ్యాధులగు నంటువ్యాధులచే క్షీణించి తుదకు సంతానహీనులగుటకుఁగూడ కారణము.

మరియు.

సీ. కులకాంతలను బాసి ♦ కులధర్మములరోసి
సానివంచలఁ జేరు ♦ చవటలార!
పిన్నపెద్దలటంచు ♦ నెన్నక మదిలోన
వెలకాంతలను జేరు ♦ వ్యర్థులార!
పూర్వార్జితము లెల్ల ♦ పూజ్యంబుగా నమ్మి
రాగమ్ముచేఁ జెడు ♦ భోగులార!
ధనధాన్యములుఁ జెల్ల ♦ దాస్యవృత్తి నిబూని
కాపురమ్ములు లేని ♦ నాథులార!

గీ. వలదు వ్యభిచారవృత్తిచే ♦ గలుగునఘము
వేశ్యకాంత భోగంబుచే ♦ వెతలుగల్గు
మానుఁడదియని మ్రొక్కెద ♦ మాన్యులార!
సుగుణధనులార! భారత ♦ శూరులార;

వ్యభిచారవృత్తిచే యఘంబు గల్గుననియు, యశంబు పోవుననియు మనసనాతన ధర్మములు బోధించుటలేదా? అందు వేశ్యాసంపర్కము

చే గల్గునష్టకష్టములు కనులారఁ జూచితిరిగదా? ఇంక వేశ్యల గోరక వారి స్నేహముఁ జేయకుందురుగాక యని వేవిధములఁ బ్రార్థించెద.

(అనుబంధము 11)

(నిష్క్రమించును. యవనిక జారును)

---

## తృతీయరంగము.

ప్రదేశము—అడవి.

[ప్రవేశము—ప్రతాపసేనుఁడు విషాదమున]

(అనుబంధము 12.

అయ్యో! ఎంతఘోరము? ఎంతదుండగము? ఎంత పాపము? ఎంతశాపము?-కులకాంతనుఘోరాటవుల పాలొనర్చినమహాపాపుఁడ-నీచుఁడ-కట్టా! నన్నీయధోగతి పాలొనర్చినదద్దురాత్మురాలగుకాంచనమాల గాదా? నాకా దుర్జాతిస్నేహము గల్గకున్న నియ్యగచాట్లు రాకుండునేమో? ఆపాపిమోహాంధకారమున మునిగి భార్యమోహముంబాదక దాని మాటలే వేదాక్షరంబులని నమ్మిన నాకింత దోగము సంభవించినది. కట్టా! భార్యమోహమునఁ బాడనిచ్చినది గాదు—నాముద్దుగుమ్మనదిసి ముచ్చటించనిచ్చినది గాదు—అంతయు మహాగారడి జేసినది—మాయ రయొనర్చినది—మసిఁబూసినది—రాజ్యభ్రష్టునిం జేసినది—అన్నపానీయంబులు లేక యల్లాడునట్లొనర్చినది—తుదకీ సన్యాసివేషము వేయించినది—అహా! కాలమా! నిన్నువర్ణించ నే కవికిందగును? కవుల కలమునకుఁగూడ నెదురైతివే?—లోకులను లోకమును నీస్వాధీన మొనర్చుకొంటివే?—ఔరా! కాంచనమాలా! ఎంతజేసితివే? నీమోహరజ్జువుచే నన్ను బందీకృతునిగఁ జేసి నన్నల్లవిధముల సన్న్యాసిని జేసితివిగదా? కులటా! నీయాజ్ఞమీరక కులగురువును రాజ్యభ్రష్టునిం జేసి తత్ఫలమందుచుంటిని. ఓ ప్రాణప్రియా! కాంతామతి

నీ వెందేగియుంటివి? అయ్యో! ఈఘోరారణ్యమున నేకూ్రరమృగం బులవాతఁ బడితివో యెఱుంగజాల, లేక ప్రాణకాంతునిచే నిరాకరింప బడిన నే నుండిననేమి లేకుండిననేమియని యసూయచే నెందైనఁ బ్రాణములు గోల్పోతివా? నాకెవ్వరు దెల్పి నన్నూరడింతురు? నీ సుందరవదనారవిందము గాంచు భాగ్యమబ్బునా? అదియేకల్ల. అయ్యో! ప్రాణేశ్వరీ! నీపాల నాదిక్కుమాలిన వేశ్య మహామారియయ్యెనే? ఆవేశ్యయే యొనర్చినది? నేను నిన్ను సగౌరవముగఁ జూచి ప్రేమించిన నీకీకడగండ్లు రాకుండునుగదా? నిక్కముగ నీపాలిమారిని నేనైతిని.

సీ. ఎన్నఁడు నాయింతిఁ ♦ గన్నుదమ్ములఁగాంచి
సంతసంబున నుండ ♦ జాలువాఁడ
నెన్నఁడు నాకాంత ♦ నెలమిమీరగఁ గాంచి
ముచ్చట లాడుచు ♦ మురియువాఁడ
నెన్నఁడు నాప్రియ ♦ వన్నె చిన్నెలఁగాంచి
బిగికౌఁగిటను నెప్పు ♦ బెనఁగువాఁడ
నెన్నఁడు నారాణి ♦ కున్న సొగసును గాంచి
ప్రాణమిదంచని ♦ ప్రబలువాఁడ

తే. గీ. నెన్నఁడింక నాదైవంబు ♦ నన్ను నాలి
ప్రాపుఁజేరిచి సౌఖ్యంబు ♦ జూపఁగలుగు
గటకటా! యట్టిపుణ్యంబు ♦ గలుగనౌనె?
లేదు యీజన్మ కికమీద ♦ లేదు లేదు.

దైవమా! ఇంక నేనేమిచేయుదును? దురాత్ముఁడనగు నన్నుఁగూడుట చేఁగదా నాపురంధ్రికిట్టియిడుములు. అయ్యో! కాంతామతీ కాంతామతీ! నడువ కాళ్లాడ కున్నవి.

# రంగము ౪

[ప్రవేశము—దూర్వాసుఁడు.]

ఈతఁడెవ్వఁడైయుండును? ప్రియకాంతా వియోగంబుచే విషాదమందుచున్నాఁడు. విచారించెద. ఓయీ! నీవెవ్వఁడవు ?

ప్రతా—తాపసేంద్రా! వందనములు.

దూర్వా—శుభమగుఁగాక. నీవెవ్వఁడవు? విషాదమేల?

ప్రతా—అయ్యా! ఓ యతి! నేనెవ్వఁడనైననేమి ? నేటికి సన్యాసినైతిని.

దూర్వా—ఓయీ! కుందకుము. నీచరిత్రమంతయు విశదీకరింపుము.

ప్రతా—మౌనిచంద్రమా! నేను ప్రతాపసేనుఁడను భూరమణుఁడను. వేశ్యాస్నేహముచే సర్వముంగోల్పోయి యీవేషముం ధరించిన సన్యాసిని, వేశ్యమాటలు నమ్మి కులకాంతను కానలఁబారఁదోలిన నీచాత్ముఁడను. నన్ననుగ్రహింపుము.

(పాదములపైఁ బడును)

దూర్వా—(పైకిఁజూచి) వత్సా! లెమ్ము. ప్రతాపసేనా!

తే. గీ. నీ సవిస్తారమంతయు ♦ నెమ్మి దనర
దివ్యదృష్టిఁ గనుఁగొంటి ♦ దిగులు వీఁడు
నీకొఱకు నాపతివ్రత ♦ నెమ్మితోడ
గౌరిపూజలచే ప్రొద్దు ♦ గడుపుచుండె.

ఓయీ! చింతలుడుగుము. నీ నిజకాంత నీరాకకై నిరీక్షించుచు గౌరివ్రతమొనర్చుచున్నది. కొలఁది కాలమున నీభార్యం గలియఁగలవు.

ప్రతా—మహాత్మా! తమకెఱుకఁబడని వార్తలుండవు. నాయెడ కరుణించి నా ప్రాణేశ్వరి యెందుండెనో సెలవీయ వేఁడెద. అయ్యా! నాయింతి యుండు పురముం దెల్ప వేడెదను.

దూర్వా—ఓయీ! ప్రతాపసేనా!

## తృతీయాంకము.

తే. గీ. నాల్గుయోజనముల దవ్వ ♦ నంగలదది
భూరిపాతకపుర మందు ♦ బాధలు నరక
మందునున్నది నీకాంత ♦ నరయఁబొమ్ము
సర్వమచ్చటఁ దెలియు నా ♦ సాధ్వివలన.

నాకనుష్ఠానమునకు కాలమైనది. నేనేగద. (పోవఁబోవ)

హరి—(అడ్డగించి) అయ్యా! నా కాంత జీవములతో నుండినదా? అంతయు నిక్కువమా?

దూర్వా—ఓయీ! ఏమి నీవెఱ్ఱి? మార్గముం దెల్పితింగదా పోవ రాదా?

హరి—అయ్యా! ఆపురమునకు మార్గమెయ్యది?

దూర్వా—(కోపమున) ఏమీ మార్గమెఱుంగవా! తొలుత వేశ్యనుం చుకొను మార్గమెవ్వరుబోధించిరి? ధనలోభమదాంధకారముచే యకార్యము లాచరించిన ద్రోహివి. ఛీ! నీమోమునుం జూడ దురితమగును. నీదారిని నీవు పొమ్ము.

(నిష్క్రమించును.)

హరి—కట్టా! ఈ మౌనిచంద్రుఁడు నామదికి మఱింత మంటలగిల్చి పోయెనే? ఆ మహాపాతకపుర మెందుగలదో యెట్లేగవలెనో యెఱుంగనైతినే? హా. విధీ! తుదకు నన్నట్టిబాములఁ బెట్టితివే? మునిపుంగవుఁడు నా ప్రాణేశ్వరివార్త పూర్ణముగ నెఱింగింపక పోయెనే? మారుబల్క నావైతనకోపాగ్నిని బరపి తనదారిని తానేగనే? అయ్యో! యింకేమి దిక్కు? ప్రాణేశ్వరీ! మహాపాతకపురమందుంటివా? ఎట్టికడగండ్లబడుచుంటివోగదా? నీయెడ నేనెంత ద్రోహముసర్పితిని?—యెంత దుండగము గావించితిని?—ప్రియా. నీదివ్యసుందరాకారము మహాపాతకపురమందుండెనా? ఇదే నీసందర్శనమునకు వచ్చుచున్నాఁడ. హా! దైవమా! ఏమి నాగతి?

కం. వెలకాంతవలన నివ్విధి
గులకాంతను గోలుపోతిఁ గూటికి కరవై
పలుబాములఁ బడనాయెను
గలనైన నిటాదునంచు కట్టా, యెఱుఁగన్.

(నిష్క్రమించును.)

(యవనికజారును)

---

పంచమరంగము;—కాంతామతి సౌధము.

[ప్రవేశము:—కాంతామతి సౌధమందాసీనయై]

(అనుబంధము. 13)

అహా! దుష్టుఁడగు నీ దుర్బుద్ధిరాజుచేఁజిక్కి నేఁటి కారుమాసములైనది. తొలుత వానితో నారుమాసముల నారురోజులు గౌరీవ్రతము సేయవలయునని యాలిసి సమాధానపరచితిని. కట్టా! నేఁటి కారుమాసములు గతించె. నింక నారుదినంబులే గడువుగలదు. ఈ షణ్మాసములనుండి యనేకులీవ్రతదానముల గొలుచుచు, భుక్తముసకును, నేత్రోత్సవముగఁ దిలకించుటకును, లెక్కకు మిక్కుటంబుగ వచ్చుచుండిరి. కాని అందు నాప్రాణకాంతునియాగమనము లేదయ్యో? హా! దైవమా! ఆరుమాసములనుండి రాని నాప్రాణేశ్వరుఁ డీయారు దినములలో వచ్చి నన్నుఁ గాపాడునా? అసంభవము అసత్యము! హా! నాథా!

[ప్రవేశము;—ప్రతాపసేనుఁడు]

(అనుబంధము 14)

హా! కాంతామతీ! నేనెంతపాపుఁడ. ఎంతక్రూరుఁడ, ఎంత నీచుఁడ. కనుక నే నాకీగతి గల్గినది.

కాంతా—(తనలో) ఈమహానుభావునిఁజూడ నాప్రియకాంతునిఁబోల్కి

గానుండె. అయ్యో! నాకంతటిభాగ్యముకల్గునా? ఒకరినిఁబోలి మఱియొకరుండరా? ఐన నీయన సమాచారమేమిటో నడిగి తెలిసికొనియెద. (ప్ర) అయ్యా! మీరలెవ్వరో యిట్లంగ. కాంతామతి, కాంతామతి యని మిగుల దుఃఖించుచుంటిరి. ఆమెకును మీకును నేమైన బాంధవ్యముండెనా? తెల్పుఁడు?

ప్రితా— మహిళామణీ! నీవెవ్వరిదానవో నెఱుంగ. నాప్రియకాంతకొఱకై వనముల దిమ్మరుచుండ, అందు దూర్వాసమహాముని నన్నుంగని నావృత్తాంతమంతయాలించి "ఓయీ నీభార్య మహాపాతకపురమున నీకొఱకై గౌరీవ్రతము సేయుచున్నది" అనినంత నేనీపట్టణముఁజేరి వెదకివెదకి వేసారితిని. నా కాంతజాడ తెలియదయ్యె? శరీర మలయుటచేత యీతిన్నెపై శయనించి యెల్లి నెమకుదమని సిందు జేరితిని? ఇదియె నా వృత్తాంతము.

కాంతా— (స్వ) ఇదంతయు నావిషయమైన చరిత్రవలెనే యుండినది. ఐన నడిగి తెలిసికొనియెద. (ప్ర) మహాత్మా! నీభార్య యేకారణమున నడవుల పాలయ్యెనో దెల్పవేడెద.

సీసమాలిక

ప్రితా— సీ. కాంచనమాలరో ♦ కాంతయింటికిఁ జేరి
జెప్పినట్లల్ల నేఁ ♦ జేసినాడ

కాంతా— అయ్యో! ఎంతమోహమునఁబడితిరి? అట్లు సేయఁదగునా? ఆపైని?

ప్రితా— పరిణయంబును లేక ♦ బ్రహ్మచారిగనుండఁ
గూడదటంచని ♦ గురుఁడు బల్క—

కాంతా— ఆహా! అతఁడెంతపుణ్యాత్ముఁడు!

ప్రితా— బలవంతముగ నాకుఁ బరిణయం బొనరించఁ
గా రాగృహమున నా ♦ కాంతనిడితి

కాంతా—పాప మీ కాంత నట్టి కష్టములపాలు గావించిరి? పైని?

ప్రతా—అంధురాలనిదని ♦ యాచెలిఁ జూడక
కాననంపినయట్టి ♦ కలుషమతిని

కాంతా—(స్వ)! దైవమా! అంతయు నాచరిత్రమేగదా? పిమ్మట
నేమిజరిగెనో? (ప్ర) తరువాత?

ప్రతా—నా రాజ్యధనధాన్య ♦ మారాము గ్రహియించ
సర్వము శూన్యమై ♦ జరుగఁబడియె

కాంతా—(స్వ) కట్టా! ఎంతదురవస్థ (ప్ర) అటుపిమ్మట?

ప్రతా—కూడునీళ్లకువాచి ♦ వేడఁబోవఁగనది
జేరనీయకఁ గొట్టెఁ ♦ జెప్పనేల ?

కాంతా—(స్వ)హా! దైవమా! తుదకిట్టిగతిఁ గల్పించితివి?(ప్ర)పిమ్మట?

ప్రతా—గీ. అంత కానకువచ్చి నా ♦ కాంత యెందు
నున్నదంచును వెదకుచు ♦ నున్న నన్నుఁ
గాంచి దూర్వాసుఁడన్ముని ♦ కనికరమునఁ
దెల్పిపోయెను సకలంబుఁ ♦ దేటపడఁగ.

అంత నగరముఁ బ్రవేశించి నాప్రియకాంత కాంతామతిని వెదకుచుంటినిగాని కాంచనైతిని.

కాంతా—మహాత్మా !

గీ. మిమ్ము విడనాడి వనములోఁ ♦ దొలఁగి పిదప
వైశ్యుచేఁ జిక్కి వానిని ♦ వదలించుకొని
దుర్మార్గుఁడైనట్టి యారాజు ♦ ద్రోలఁబడియు
గుందుచుంటిని మీకునై ♦ డెందమందు,

ప్రాణేశ్వరా ! తొలుత మీరు చెప్పిన నిర్భాగ్యురాలగు కాంతామతి యిదియె, నాథా! వినుము. ఈదుర్బుద్ధిబారినుండి తప్పించుకొన నావశము గాక "యారు మాసముల యారు దినములు నాకు గౌరీవ్రతముగలదు.

ఆపైని సీయిష్టము" అని నుడివి నాపాతివ్రత్యమును గాపాడుకొనిరి యారు మాసములనుండి మీకొఱకై జూచుచుంటిని. నేఁటి కారుదినములు గడువుగలదు. ఇంక మీరువచ్చుట కల్లయని దుఃఖించుచుంటిని. నాపుణ్యవశముచే నేఁడు మీసుందరవదనారవిందముఁ దిలకించు భాగ్య మబ్బినందుకు సంతసించితిని.

ప్రతా—అయ్యో! కాంతామణీ! నీ వీనిర్బంధమునుండి దాటుటెట్లు? నన్నుఁ గూడుటెట్లు?

కాంతా—ప్రాణేశ్వరా! నేనొక్కటేఁ దెల్పెద వినుఁడు. నేఁటినిశీథమున నిశ్రేణిసహాయమున నే మీచెంతకుఁ జేరెద. కావున మీరింకే శయనింపుఁడు. మౌనము ధరింపుఁడు. ఈ జాడ దుష్టబుద్ధికిం దెలిసిన కార్యభంగము కాఁగలదు. ఇంక శయనించుఁడు.

ప్రతా—ప్రాణేశ్వరీ! మఱచెద వేమో?

కాంతా—ప్రాణేశ్వరా! మీకొఱకెదురు చూచుచున్న నేను మఱతునా? ఇంక నిదురింతునా?

ప్రతా—(శయనించును)

కాంతా—(స్వ) నేఁటికి నానోము ఫలించినది. నాప్రతము ధన్యతనొందినది. నేఁ గృతార్థురాలనైతి. పెరలకంటఁ బడకుండ నీయర్ధరాత్రి యిందుండి నా నాథునిఁగూడి మార్గముఁ బట్టెదఁగాక.

[ప్రవేశము దొంగ.]

ఇయ్యాలకి మూడురోజులమించి యాడదిరిగినా యాంలేదు. కారణం యేందో తెల్దు. అన్నంపున్నం యేంయెఱుఁగ. అంకాళమ్మను పోలేరమ్మను, గంగానమ్మను, మాలచ్చుమమ్మను, అంకమ్మను మరిగిత్తె పోతరాజును, అందఱికి మొక్కేవత్తుండాను. నేను మొబ్బేటకొచ్చి యున్న డిట్టా పూరికె మీలేదబ్బా! యీమూడురోజులమించి ఓరిముంగం సూత్తుండానోగాని మొబ్బేట దొరకటంలేదు. అసలు నేను

దొంగల్లో మొనగోణ్ణి, నే పుట్టిన గడియ అసువంటిది. మిట్టమద్దేల జాంపొద్దు కాడ. పొద్దుకూకేల, జాంపొద్దుపోయి మరిగత్తే అద్దంరేత్తిరి కాడ నిద్దురమత్తులో అమాసనాడుపుట్టేను. అమాసనాడు పుడితే మంచిదొంగతనంఅబ్బుద్ది. అమ్మతోడు. ఇయ్యాల కుద్దేవతని యేదు కొని మొక్కేటకెల్తా. కీర్తన.

గంగానమ్మా! పోలేరమ్మా ! కరుణిచ్చినగాగావుమమ్మా॥గం॥
ఆరు కాళ్ళా జీవమిప్పుడె—యరవగాను బలియునిత్తా
యూరియున్నాకల్లుదెచ్చి-వారబోతు తల్లిరో! ॥గం॥
వొంగివొంగీ కన్న మేచి-ఒడుచుకొత్తాచొమ్ములన్నీ
దొంగతనానికియెల్తా-తోడురావెతల్లిరో!...॥గం॥

ఇంకాపోతా, ఈమేడకే కన్నా మేత్తా (పోవుచు ప్రితాలసేనుని జూచి) ఈడోడో వండుకుండాడు, ఈడికాడ యేమున్నా ఆళపాటు సూసుకుందాము. (నెత్తిపై గుడ్డదీసి విచ్చిచూచి) ఛీ! యదవనాయాలా! అంతా సినిగిందే? (చూచి) ఓరిబాబో యీడోడో నన్నాసోడు. ఛీ! యీడి మొగం సూడగూడదు. దరిద్రిపెదవ. యీమేడకియ్యాల బొక్కుడతా. (కన్నంవేసి అందుకాళ్ళుపెట్టును తేలుకుట్టును.)

కీర్తన

తేలుగుట్టింది-అబ్బో తేలుగుట్టింది-నల్ల తేలుగుట్టింది-అహా తేలుగుట్టింది।
తేలు పాడుగాను బాగ- కాలికిగుట్టింది అబ్బా - నల్ల తేలుగుట్టింది-
నన్ను తేలుగుట్టింది॥
వజ్రిమేళకేనులేసి - వొచ్చాను పోడుగాను - తేలుగుట్టింది
అబ్బా తేలుగుట్టింది - నల్ల తేలుగుట్టింది - హా! తేలుగుట్టింది॥

కాంతా—(చప్పటులు గొట్టి) ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! మాటలాడక యిటులుండు. నడుతేయిమీరినది.

(అనదొంగ చంపకుఁబోవును. కాంతామతి మేడగదిలోనకుఁబోవును)

(యవనికజారును.)



శ్రీరస్తు.

# కాంతామతి.

## చతుర్థాంకము

ప్రథమరంగము:- అడవి

[ప్రవేశము దొంగ, వాని వెంట కాంతామతి]

దొంగ—(అరణ్యమధ్యమున నిలచి మాటలాడకుండును.)

కాంతా—ఏమిది. నాన ధుఁడేయని మోసపోతినే? అయ్యో! యెంత గ్రహచారము. (అని వణుకుచు దొంగను జూచును.)

దొంగ—(కదలకుండ గ్రుడ్లు ద్రిప్పుచు నిలచియేయుండును.)

కాంతా—(భయముతో) అయ్యో! ఇది యేమి? నాప్రాణేశ్వరుడని నమ్మి మోసపోతినే! హా! మాలదైవమా! ఇంకను నా కడగండ్ల గట్టుపట్టింపక బాధించుచుంటివా?

దొంగ—(పైరీతిగానేయుండును)

కాంతా—(భయముతో) చూచుటకు నల్లగ నొక బొద్దురీతిగ గన్పట్టుచున్నది. ఇదేదైన యడవిమృగమైయుండునా? అడవిమృగమైన యిల్లేల నిలచియుండును? కాదు కాదు. (మరలచూచి) అడవిమనుష్యుఁడైయుండునా? అడవి మనుష్యుఁడైన వికారరూపముగనుండడా? ఆఁ స్ఫురించినది. కొరవిదయ్యములు నల్లగనుండుననియు, మాటలాడక బొద్దువలె నిలచియుండుననియు, మాతల్లిదండ్రులు నా చిన్నతనమునఁ జెప్పియుండిరి. ఇదిగాక

అని ముఖ్యముగ నిర్జనప్రదేశమందే యుండుననియు నుడివిరి. అటులనే యెవ్వరును సంచరించని యీఘోరారణ్యమునకు నన్ను రప్పించినది.

(అని దగ్గరకుఁబోయి మరలఁ జూచును.)

దొంగ—(పైరీతిగనే యుండును.)

కాంతా—అయ్యో! దైవమా! నాకింక తెరువేయ్యది? ఆదుర్బుద్ధి బారినుండి తప్పించుకొని ప్రాణముల నిల్పుకొంటినిగదా యని సంతసించితిని. ఇది భూతమో అడవిమనుష్యుఁడో? ఇపుడిచట నుండి తప్పించుకొను నుపాయము దోఁచక మిగుల భీతిఁగొల్పుచున్నది. (ముందుపోయి వెనుకకేగును)

దొంగ—(పైరీతిగనే యుండును.)

కాంతా—(దొంగమోముజూచి) అయ్యో! అవలకుఁ బోవుదమన్న నీభూతమును జూచినది మొదలు కాళ్ళు వడకుచున్నవి. భీతి గొల్పుచున్నది. నాకేమియుఁదోఁచుటలేదు.

(అని మెల్లగ నావలకుఁ బరుగిడును, లోన పెద్దధ్వని గల్గును.)

దొంగ— కీర్తన.

సిక్కేవు సిక్కేవులే - నక్కానిపిల్ల ॥సి॥
ఎక్కడికిపోతావు? యేందది సెప్పింక - మొల్లైననిన్ని దవనేపిల్లో
మొల్లైన నిన్నిదవనే
పెళ్ళినన్ను చేసుకుంటె వొళ్ళెల్లసొమ్ములెడత - కల్లంతతెచ్చి
పోత్తనే పిల్లో పిల్లో ॥సి॥
నక్కాజిత్తులమారి - నాముత్రిపిల్లో సిక్కేవు సిక్కేవులే
పిల్ల పిల్ల పిల్లో సిక్కేవు సిక్కేవులే నక్కానిపిల్ల ॥సి॥

కాంతా—(స్వ) ఏమిది! వీడు నిక్కముగ మనుష్యుఁడేయై యుండును.

దొంగ—(స్వ) తొలింబరంగ నన్ను సూసిపేణేశా! అన్నది. నానంత సోగ్గావుండాగామాల్నా? కాదించినాసోకు నాటాకు. నాటీకు. నన్ను మోయించి పేణేశా! అంటా నామొంబడి వడ్డది. నానంత సోగ్గా వుండా గామాల్నా?

(అని వికటముగ నవ్వును.)

కాంతా—ఓరీ! నీవెవ్వఁడవు?

దొంగ—నేనే.

కాంతా—నేనే యన నెట్లు తెలియును? వివరముగఁ జెప్పుము.

దొంగ—యహై! నేనే నంటే తెల్దు?

కాంతా—బాగుగానున్నది. కాని నీవర్ణమేమి?

దొంగ—నావర్ణము నీలవర్ణమే.

కాంతా—సరి సరి అడవి మనుష్యుఁ డన్నందుకు సరిపోయినది. (ప్ర) వర్ణమనగా కులము. తెలసెనా?

దొంగ—అట్టా సెప్పరాదూ? మరి మచ్చేటకులం,

కాంతా—మచ్చేటకులమనగా నేమి? సరిగా జెప్పుము?

దొంగ—యహై! మచ్చేటకులమంటేను.

కాంతా—నీవృత్తి యేమి?

దొంగ—ఇదే.

కాంతా—ఓరీ! ఇంక నీ శో్రివన నీవుఁ బాయుమ్ము. అధిక ప్రసంగముతో బనిలేదు.

దొంగ—ఇదిగో! మరిగత్తే పేణేశా! అని నన్ను మోహించి నాయొంటబడి యిప్పుడేదకల్తా? నన్ను పెళ్లి సేసుకోవు?

కాంతా—నీకుఁ గావలెనా? నీరూపమునకుఁ బెండ్లియే తక్కువ సుమా?

దొంగ—తక్కువో? యెక్కువో? నన్ను పెళ్లి సేసుకుంటావా లేదా?

అవి ముఖ్యముగ నిర్జనప్రదేశమం దే యుండుననియు నుడివిరి. అటులనే యెవ్వరును సంచరించని యీఘోరారణ్యమునకు నన్ను రప్పించినది.

(అని దగ్గరకుఁబోయి మరలఁ జూచును.)

దొంగ—(వైరీతిగనే యుండును.)

కాంతా—అయ్యో! దైవమా! నాకింక తెరువెయ్యది? ఆదుర్బుద్ధి బారినుండి తప్పించుకొని ప్రాణముల నిల్పుకొంటినిగదా యని సంతసించితిని. ఇది భూతమా అడవిమనుష్యుఁడో? ఇపుడిచట నుండి తప్పించుకొను నుపాయము దోఁచక మిగుల భీతిఁగొల్పుచున్నది. (ముందుపోయి వెనుకకేగును)

దొంగ—(వైరీతిగనే యుండును.)

కాంతా—(దొంగమోముజూచి) అయ్యో! ఆవలకుఁ బోవుదమన్న నీభూతమును జూచినదిమొదలు కాళ్ళు వడకుచున్నవి. భీతి గొల్పుచున్నది. నాకేమియుఁదోఁచుటలేదు.

(అని మెల్లగ నావలకుఁ బరుగిడును. లోన పెద్దధ్వని గల్గును.)

దొంగ— కీర్తన.

సిక్కేవు సిక్కేవులే - నక్కానిపిల్ల ॥సి॥
ఎక్కడికిపోతావు? యేందదిసెప్పింక - యెల్లైననిన్నిదవనేపిల్లో
యెల్లైన నిన్నిదవనే
పెళ్లీనన్ను చేసుకుంటె వొళ్లెల్లసొమ్ములెడత - కల్లంతతెచ్చి
పోత్తనే పిల్లో పిల్లో ॥సి॥
నక్కజిత్తులమారి - నాయొంటిప్రిపిల్లో సిక్కేవు సిక్కేవులే
పిల్ల పిల్ల పిల్లో సిక్కేవు సిక్కేవులే నక్కానిపిల్ల ॥సి॥

కాంతా—(స్వ) ఏమిది! వీడు నిక్కముగ మనుష్యుఁడేయై యుండును.

డొంగ—(స్వ) తొలింబరంగ నన్ను సూసిపేనేశా! అన్నది. నానంత సొగ్గావుండాగామాల్సు? కామించెనాసొఘ నాటాకు. నాటేకు. నన్ను మోయించి పేనేశా! అంటూ నాతొంబడి పడ్డది. నానంత సొగ్గా వుండా గామాల్సు?

(అని వికటముగ నవ్వును.)

కాంతా—ఓరీ! నీవెవ్వఁడవు?

డొంగ—నేనే.

కాంతా—నేనే యన నెట్లు తెలియును? వివరముగఁ జెప్పుము.

డొంగ—యహై! నేనే నంటే తెల్దు?

కాంతా—బాగుగానున్నది. పోనీ నీవర్ణమేమి?

డొంగ—నావర్ణము నీలవర్ణమే.

కాంతా—సరి సరి అడవి మనుష్యుఁ డన్నందుకు సరిపోయినది. (ప్ర) వర్ణమనగా కులము; తెలసినా?

డొంగ—అట్టా సెప్పరాదూ? మరి మజ్బేటకులం,

కాంతా—మజ్బేటకులమనగా నేమి? సరిగా జెప్పుము?

డొంగ—యహై! మజ్బేటకులమంటేను.

కాంతా—నీవృత్తి యేమి?

డొంగ—ఇదే.

కాంతా—ఓరీ! ఇంక నీత్రోవన నీవుఁ బొమ్ము. అధికప్రసంగముతో బనిలేదు.

డొంగ—ఇదిగో! మరిగత్తే పేనేశా! అని నన్ను మోహించి నాతొంటబడి యిప్పుడేడకెల్తా? నన్ను పెళ్లి సేసుకోవు?

కాంతా—నీకుఁ గావలెనా? నీరూపమునకుఁ బెండ్లియే తక్కువ సుమా?

డొంగ—తక్కువో? యెక్కువో? నన్ను పెళ్లి సేసుకుంటావా లేదా?

కాంతా—ఓరీ! నీకొక్కమాటఁ జెప్పెద వినుము. (స్వ) వీనిబారినుండి యెట్లుగా తప్పించుకొందును? యేమియుఁదోఁచుటలేదే?

దొంగ—యేందది? సెప్పు సెప్పు యింటాను.

కాంతా—పెండ్లిసేసుకొనుటకు నీకును నాకును భేదము గలదు. అందుచే కుదరదు.

దొంగ—బేదం అంటే.

కాంతా—నల్లనిరూపుచే చూచుట కసహ్యముగ మలినవస్త్రములతో నుండు నీకెట్లుగా పెండ్లియగును?

దొంగ—నాకేంటె సోగ్గావుండావేం? యిదిగో! మాటినూ.

కీర్తన.

నల్లోడునైతేను=నాసామిని అంటారు? నామాట యినవే పిల్లా
చక్కానిపిల్ల నామాటయినవేపిల్లా

హాయ్ హాయ్ చీరాము లెట్టుండనే? చెప్పవే పిల్లో చీతమ్మ యెట్టుండనే?

పిల్ల పిల్ల పిల్లో కుక్కమారి యెట్టుండనే? చెప్పవే పిల్లో చెప్పవే పిల్లో? రుక్కుణమ్మ యెట్టుండనే?

కాంతా—నీకునిజముగా పెండ్లి కావలెనా? అట్లయిన షోకుగా నుండవలెను, మంచిడ్రెస్సులు వేసికొని బంధుసహితముగా రావలె.

దొంగ—బంధుసహితం అంటే?

కాంతా—చుట్టాలతో గూడా.

దొంగ—అట్లాగే పిల్చుకొత్తాగాని నువ్వెల్తాయేము. యెత్తే?

కాంతా—వెళ్ళునుగాని మంచిడ్రెస్సులతో గూడ రావలెను.

దొంగ—మంచియిలేయే నాకు.

కాంతా—ఐన పోయిరమ్ము.

దొంగ—యెల్తాయేము.

కాంతా—నే నచ్చటికి పోయెదను. నీకోఅక్కై యిచ్చటనే యుండె దను. శీఘ్రముగరమ్ము.

దొంగ—మవ్వొల్తాయేసు. ఇదిగో నీపేరేంది. సెప్పుమరి?

కాంతా—రాజాధిరాజసార్వభౌమ ప్రతాపసేనరాజేంద్రుని దేవేరి యగు కాంతామతీదేవి.

దొంగ—అబ్బో! అంతపెద్దదా? నాకు రాదు సిన్నదిసెప్పు ?

కాంతా—ప్రతాపసేన రాజేంద్రునిభార్య, కాంతామతీదేవి.

దొంగ—బాబో! యింకాపెద్దదే యింకోటిసెప్పు ?

కాంతా—సరే కాంతామతీదేవి.

దొంగ—ఊహూ ! యింకాసిన్నది ?

కాంతా—కాంతామతి,

దొంగ— అదినాకురాదే?

కాంతా—నేఁ జెప్పెద పల్కుము. కాంతామతి (ఒక్కొక్కయ క్షరముఁజెప్పును.)

దొంగ—పైరీతిగాఁ బల్కును. (కాఁతసేపటికి వ్రేళ్ళు లెక్కపెట్టుకొని) గంత గంత గంత యింకరాదు.

కాంతా—పోనీ యట్లనేపిలువుము,

దొంగ—(స్వ) గంత గంత గంత యిదిగో! యిదిగో మొల్తాయేసు.

కాంతా—నేనచ్చటికి వెళ్ళెను. నీవుమాత్రము తొందరగారావలెను.

దొంగ—మొల్తుండ. పోతుండ. మల్లొత్త. నూవెల్తాయేసు.

కాంతా—అబ్బ ! పొమ్ము. నమ్మవా? నమ్మకున్న నీకింతియే.

దొంగ—యొల్తుండ. పోతుండ నువెల్తాయేసు, అట్టాకాదు, నేగిరిగీసి మొల్తా. (కాంతామతి చుట్టు గిరిగీసి ఉమ్మి వేయుచు పోవఁ బ్రియత్నించి) యిదుగో! మొల్తా. బోతాను. వెల్లమాకే. నా నిప్పుడే పత్తా. (నిష్క్రమించును.

కాంతా—అబ్బా ! వీనిబాధ పడలేక విసిగిపోతిని. వీనినిఁజూడ నవ్వు
ను, నాగతిఁ దలంచ దుఃఖమును వచ్చుచున్నది. (అటు నిటు
జూచి) నేనింక యిందు నిలువఁ జనదు. మరల నామొగుఁ
డు రాఁగలఁడు. వాఁడు రాకమున్నె వేరొకమార్గమునఁ బోవు
ద. హా ! దైవమా ! ఎట్టి యిక్కట్టులఁ బెట్టుచుంటివి?

[పునఃప్రవేశము-అదే స్థలమున దొంగ,వానిబంధుగులు మేళముతో]

1 అన్నా ! మావదినేదీ?

2 మామా ! మాఅత్తేదీ?

3 బావా ! మాఅప్పేదీ?

4 తమ్ముఁడా ! మఱఁదలేదిరా?

దొంగ—యహ్హా ! ఉండదిలే అరవమాకండలే.

(బంధుగులందఱు కలసి పాటలు పాడుచు పంచరంగులు దెచ్చి ముఖ
మునకు, శరీరమునకు రాచెదరు.]

1 అన్నా ! మావదిన యెక్కడనున్నదో తీసుకురా ?

దొంగ—అల్లదుగో! ఆపొదసాటున కూకొనుమట్టే. సెయ్యిపట్టిలాక్కు
రా. పో.

1 (పోయి చూచివచ్చి) ఎల్లిగ మల్లిగ పుల్లిగో ! అంతా వుత్త
దేరో దొంగతవ. మన్నికూడా తీసుకొచ్చాడు. (అని కొట్టును

అందఱు—యెదవా ! అబద్ధాలు సెప్పి పిల్చుకొత్తావా (అని కొట్టి
నిష్క్రమింతురు)

దొంగ—గంతా! ఓగంతా! ఓగంతా! (అని యేడ్చుచు) సీతల్లెమ్మ
దిగ్గొయ్యి, మాయమాటలు సెప్పి మంచిపేరును వేసుకురామ
ని సెప్పకుండల్లే ? నిన్ని యడియిలో పట్టుకోకపొయ్యానం
టే నేదొంగనేనా? మరిగెత్తె నన్నె నేనా? యెల్తాపెళ్ళి సేసుకొత్తా

(నిష్క్రమించును. యవనికజారును.)

———



శ్రీ

# కాంతామతి.

## పంచమాంకము



ప్రథమరంగము—అడవి, మఱొక భాగము

[ప్రవేశము కాంతామతి- విషాదముతో]

(అనుబంధము 15)

అయ్యో! నేనెంత పాపురాలను?

చ. వెలయఁగ మున్ను దంపతుల ♦ పీడఁగ తంపులు పెట్టఁజట్టి భూ
తలమున నట్టి పాపఫలి ♦ తంబొగి నే నను భావ్యమందితిఁ
నిలువఁగనీడ లేక మఱి ♦ నీళ్ళును, కూడును లేక సర్వదా
యిలఁ జరియించుచుంటి నిఁక ♦ నింతలు జర్గునటం చెఱుంగనే.

కట్టా! దైవమా! ఇంతవఱకు మువ్వురచేఁ బడరాని పాట్లుపడి తిని. ఇఁక ముందైన నాకష్టములు గట్టువట్టునా? ఏమి నావెడఁగు? నాయట్టి నిర్భాగ్యురాలికిఁ గష్టములు తొలఁగునా? కల్ల. నేధన్యురాలనేయైన నాపతిచెంతనే యుండుదానఁగదా? ఇట్టికష్టముల కేల లోనౌదును.

గీ. భాగ్యహీనను గాఁజట్టి ♦ పతిని వీడి
కుంది కృశియించుచుంటి నా ♦ డెందమందుఁ

గటకటా! కాననముల నా ♦ కంజజాతుఁ
డుంచుమని వ్రాసెఁ గాఁబోలు ♦ నొప్పిదముగ
మూఁడుపంక్తుల నుదుట స ♦ మ్మదముతోడ.

హా! ప్రాణనాథా! నీసుందరవదనారవిందముఁ జూచుభాగ్య మీజన్మమున నిర్భాగ్యురాలనగు నాకుఁ గలదా? కల్ల. మందభాగ్యురాలనగు నేనెట్టిపాపము లొనర్చితినోగాని ఎందుఁ జూచినను అన్నియు నశుభములే. ఎందుఁ బోయినను అన్నియు సంకటములే. ఇంక నేనేమి సేయుదు? హా! ప్రాణేశ్వరా! నీప్రియకాంతను కానరావా ?

ఉ. నాథుని మెట్టినిల్లు మరి ♦ నాతలిదండ్రుల సోదరాదులన్
మోదముగూర్చు నాసఖుల ♦ ముచ్చటలాడెడు రాజకీరమున్
నాదయివంబు జాలక వ ♦ హా! విడనాడి యహర్నిశంబు నీ
బాధలనందనాయెనో? నీకఁ బ్రాణము ♦ పోదుగదాయె? దైవమా

హా! నిర్భాగ్యురాల నిర్భాగ్యురాల (ముందునడచును)

[ప్రవేశము: రాజకుమారులు ఇద్దరు ఒకవైపున]

1 మిత్రమా! నీకన్న నెక్కుడు మృగముల నేనే సంహరించితిని.

2 ఇట్టి యనృతము లాడకుము. నీవామృగములతోడఁ బరుగిడఁ జాలకుండుటచే ప్రతిమృగమును నేనుగదా కోలంగూల్చినది?

1 వీటికేమిగాని ఆటుఁ జూడుము.

2 ఓరా! ఏమి దాని సొయ్యారము ? నామనము తత్తరించుచున్నదే?

మ. అరవిందంబులు జూడు కన్గవలు నీ ♦ లాభ్రంబవా ముంగురుల్
శరదిందుప్రతిబింబమా ముఖమరే! ♦ సర్వాంగ సౌందర్యమున్
యరరే! వర్ణనసేయజాలను—బళా! ♦ యీయింతి సింగారమున్
ధరలో నెవ్వతెకైన నుండనె? సఖా ♦ తథ్యంబు యూహింపుమా.

1 మిత్రమా! ఏమీ దానిసోయగము? ఓరా! ఎంతవన్నెలాడి?

సీ. కమలజారికి కళం ♦ కము గలదంచని
ఎకసక్కెమాడు నీ ♦ సకియమోము
కంబుజంబునకు పో ♦ ల్కగమస్థిరంబని
నిరసించు నీకాంత ♦ నీటు గనులు
కుంద కుట్మలములు ♦ కుదురుగా లేవని
యదలించు నీతన్వి ♦ రదనపంక్తి
జక్కవలాకృతి ♦ సరసంబు లేదని
సైగచేయుఁ బోలంతి ♦ స్తనయుగంబు
గీ. నిట్టి శుభరూపలావణ్య ♦ మింతులందు
జూచియుండను—జూడను ♦ జూడబోను
నీశుభాంగినిఁ జేపట్ట ♦ నిహము పరము
గలదు పురుషుల కరయంగఁ ♦ గలియుగాన.

సఖుఁడా! దాని మాటలాడించి చూతము రమ్ము. రమ్ము. (దాపుఁజేరి) చెలీ! నీవెవ్వరిదానవు? ఒంటరిగ నీఘోరాటవులం ద్రిమ్మరు కారణమేమి? నీమగడెవండు? సర్వము. దెల్పుము?

కాంతా—అన్నలారా! కర్మవశమున నీయరణ్యములఁ ద్రిమ్మరుచుం టిని. నావిచారణ మీకేల? మీమార్గమున మీరు పొండు.

2 (కనుసైగ చేయును.)

1 చెలీ! నీకథయెల్లఁ జెప్పక దాచితివి. కానిమ్ము. వంటయింటి కుందేలువలె మాచేఁజిక్కితివి. ఇంకెందుఁబోఁగలవు?

(అనుబంధము 16)

2 సీ. నిను బాసి నేనింక ♦ నిలువజాలను బాల
కోరికఁ దీర్పవే ♦ కుందరదన!
1 కనకాంగి! నీ నీటు ♦ గన్గొన మదికి సం
తాపమాయెనిట్లు? ♦ తాళు దకట!

2. సరసిజనేత్రి! నీ ♦ సౌందర్యమూరసి
నంత, గలఁగఁ జెంది ♦ లజ్జవాణి !
1. సతులననేకుల ♦ క్షితితలంబునఁ గంటి
గాని నిన్బోలిన ♦ కాంతఁజూడ
2. గీ. మోవి చక్కెర రుచిజూపె ♦ ముద్దుగుమ్మ !
1. నీదు కౌఁగిట నను జేర్పు ♦ నీలవేణి !
2. మరునిదాడికి నోర్వనో ♦ మందయాన !
1. నన్నుఁ గరుణించి బ్రోవవే ♦ వన్నెలాడి !

2. కలికీ! మాకోరికఁ దీర్పనిదీ నిన్ను విడుచుటకల్ల. కావున నీ వీ కార్యమున కంగీకరించుము.

కాంతా—హరిహరీ! (చెవులుమూసికొని) ఎంతమాటాడితిరి.

కా. అన్నా! మీకును నేనుసోదరిని మీ ♦ యంఘ్రిల దగఁ గొల్చెదన్
నన్నీరీతిని గోరఁగాదగునె? య ♦ న్యాయంబుగానిట్లు, గా
కున్నన్ మీకిలఁదోడబుట్టువులు లే ♦ రో? వార లిమ్మార్గము
న్నన్నారా? యది చెప్పుడీ ? పిదపమీ ♦ రుర్వీశ్వరుల్ గారొకో.

మీరు రాజవంశజులుగారా ? ఏమోనబ్బ. రాచవారైనవారిలో నింత జ్ఞానహీనులుందురా? లేకేమి; కొందఱు వావివరుసలెఱుంగని పశుప్రాయులుగలరు. రాకుమారులారా! మీకీబుద్ధితగదు. మీత్రోవనుఁ మీరుపోండు; పాపము చాలశ్రమపడి మంచినీతి నేర్చితిరి, మీకునీతి చెప్పువారులేరా ? మీపెద్దలకును నిదియే సమ్మతియా ? ద్రోహులారా!

1. కాంతామణీ! వేయిమాటలాడువారముగాము. ఎట్లైన నంగీకరింపక తప్పదు. లేకున్నఁగుక్కుటమురీతి యని యోచుము. ఇంక జాగుసేయక లెమ్ము. ఆపొదరింటికడకు బోవుదము.

కాంతా—

గీ. పరసతులపొందు భువిఁగడు ♦ పాపమనుచు
చెప్పియుండరె? యార్యులో ♦ చెనటులార !
యఘముగల్గును మీకింక ♦ నాయువుడుగు
పొందు కొంకక వేగము ♦ పొద్దుపోయె.

2. ఇందువదనా ? పరసతులపొందు పాపమని యెందువ్రాసియుండినది? చూపఁగలవా? ఉండనీవే. తెలివిహీను లెవ్వరో వ్రాసినదిగాని తెలివిగలవారలు వ్రాసినదిగాదు.

కాంతా—అవును. వారు తెలివిహీనులు. మీరు తెలివిగలవారు. కనుకనే యింక నీతితప్పక సంచరించుచుండిరి. లోకమున నింకెవ్వరైన తెలివిహీనులుండిన మీకడనున్న తెలివిని బోధించి మీయంత బుద్ధిమంతులుగ జేసి మీవెంటనే త్రిప్పుకొనుచు యశమార్జింపుడు.

1. గీ. మాటలేల? ముమ్మాటికి ♦ మరుని కేళి
దేల్పు నన్నింక జాగేల ♦ దెరవమిన్న (పట్టుకొనఁబోవును)
2. వానిమాటలకేమిలే ? ♦ వనరుహాక్షి
నన్నుఁగూడితో వేవేగ ♦ నిన్నుఁగొలతు.
(పట్టుకొనఁబోవును)

కాంతా ! నన్ను వివాహమాడుము, నీకెందును లోపములేదు.

1. తన్వి ! నన్నుఁ జేపట్టుము. నీకు సర్వాధికారమొసంగెద.

కాంతా—(స్వ) వీరికెన్నినీతులు జెప్పినను వినక నన్ను భంగపెట్టనెంచిరే ? కానిమ్ము; వీరిని కపటోపాయమునఁ దప్పించుకొనను పాయముఁ బన్నెద. (ప్ర) రాకుమారులారా! మీకు నిజముగ వివాహము గావలెనా ?

1. నాకుఁ గావలెను.

2. నాకుఁగావలెను. (మొదటివానిని కొట్టును)

కాంతా—రాచకున్నలారా! మీరు చిన్నవయస్కులు. నేనన్ననో పెద్ద వయస్కురాలను. మనలకు వైవాహికం బెట్లు పొసగును?

1. కాంతా! నీకన్న నేనే పెద్దవాఁడను చూడుము.

(అని మీసమును జూపును)

2. తరుణీ! నీకన్నను వీనికన్నను చాలాపెద్దవాఁడను నీవు విచారించి మరి తెలుబట్టుము. [మొదటివానిని నెట్టివేయును]

కాంతా—ఔను! మంచియుక్తవయస్కులు నాకు లభించిరి, ఇతఁడు బాలుఁడు, నీవు వృద్ధుఁడవు. మంచిదాంపత్యము, మీతోటిదాంపత్యము నడుసౌఖ్యముగనుండును. చాలు చాలు పొండు.

(పోవఁబోవును రాకుమారు లడ్డమువచ్చి నిర్బంధింతురు.)

కాంతా—[స్వ] వీరలనింక కపటోపాయమునఁదప్పించుకొనవలయును. [ప్ర] యువకులగునో వీరులారా! మీకు నిజముగ నాపైఁ బ్రేమ యున్న నేనొక్కటిఁ జెప్పెద. అందుల కంగీకరించి నాకట్లొనర్పవలయు. అట్లు చేసెదరా?

1. అట్లే చేసెద.

2. నీయిష్టమగునట్లు నేముందు చేసెద.

కాంతా—అట్లయిన ముందు మీదుస్తులిందుంచుఁడు.

1. 2. ఇదిగో! ముందునావి. ముందునావి. (విడచి క్రిందనుంతురు.)

కాంతా—ధనుర్బాణములఁగూడ నిందుంచుఁడు.

1. 2. ఇదిగో! ముందునాది. ముందునాది. (ధనువులఁగూడ క్రిందఁ బెట్టుదురు.)

కాంతా—ఇంక వినుఁడు. నన్నుఁ బెండ్లాడఁదలఁచుకొన్నది నిజమేగదా?

1. 2. నిజము. నిజము.

కాంతా—అట్లైన వినుఁడు. ఈశరమును రివ్వున వేసెదను. దాని ముందుగ నెవ్వరుదెచ్చిన వానిఁ జేపట్టెదను. ఇదిగో బాణమువి విసరుచుంటిని. (బాణముఁ దీసికొని ఒకవైపునకు విసి వేయును. రాకుమార్తెలు పర్వులెత్తుదురు) అన్నట్టి, నిన్ను కన్నులుదెరచిన వారికిఁగూడ భార్యగావలసివచ్చె కనుకనే లోకమెల్ల యున్మత్తవ్యాధులు వ్యాపించి నానాట క్షీణించి కడకు మృతులగుచున్నారు, తమ దేహపటుత్వము తామెఱుఁగక సంచరించు నిట్టి మూర్ఖులగతు లెట్లుండవలెనో యట్లనేయుండును, మరచినాను, ఆమూర్ఖులు రాకమున్నె యీ దుస్తులను ధనువులనుధరించి పురుషవేషమున ముందుమార్గముఁ బట్టెద.

(దుస్తులను ధనువును దీసికొనిపోవును)

[పునః పరివేశముఁ గాశిరాజకుమారులు, అదేస్థలమున]

1. (చూచి) అన్నా! ఎంతమోసగించినది? ఎన్నోనమ్మికలఁ జెప్పి నమ్మించుటయు గాక దుస్తులను ధనువులఁగూడ గొనిచనెనే? కనుకనే స్త్రీజాతిని విశ్వసింపఁ దగదనియు, కంఠముఁగోసినను నమ్మరాదనియు పూజ్యులగు పెద్దలు నుడివియుండిరి.

2, అన్నా! ఆకాంతను వదలి నీవే జేసికొనుము.

1. నాకేమియువలదులే? నీవే జేసికొనుము.

2. ఆ మనగతిపెండ్లివలెనే యున్నదిలే? మనదుస్తులతో సహా గైకొని పోయినది. ఇంక మనమెట్లు పురములోనికిఁబోవుదము? దుస్తులులేక పురముఁ జేరితిమని చూచువారెల్లరు మనల వింతగఁజూచుటయుగాక, దుస్తుల నెందోగోల్పోయిరని గొల్లు పెట్టెదరు. కాన నట్లైన యీకాంతారమందు నాకాంతను వెదుకుదము రమ్ము.

1. అన్నా! మదాంధకారముచే మన మాకాంతను గోరుటచేతనే గదా? మన కిట్టికష్టములు గల్గినవి? పరభాగులనుగోరుటపాప మనినుడివితే యుండెనది. పాపఫలమెట్లోగ మేమియు లేదు. అన్నా! ఆపాపమిప్పుడు మనపైఁ బరిణమించినది. ఇంకను నుడుపులఁ దెచ్చుకొనుటకై యూనాఁటిపో యిన మార్గముఁబట్టి పోవుదముగమ్ము, మన గ్రహచారదేవత యిట్లు జేసినదిలే.

(నిష్క్రమించును యవనికజారును.)

ద్వితీయరంగము ఉద్యానవనము.

[ప్రవేశము:— కాంతామతి పురుషవేషమున శయనించి]

[పుష్పములఁగోయుచు చంద్రరేఖ కొందఱు చెలికత్తెలు ఒకవైపున.]

(అనుబంధము 17.)

చెలి—సఖీ! చంద్రరేఖా! నీమదికి నచ్చిన పురుషసింహుఁడు నేఁడు గదా లభించినది? అమగో! ఆ లతాకుంజములచెంత శయనించి యుండిన సౌందర్యమూర్తిం జూడుమా? ఆహా! ఎట్టిసుందర వదనారవిందము?

చంద్రి—(చూచి) ఔనే చెలీ! ఇదివఱ కెందఱనో రాజకుమారులఁ జూచి యుంటినిగాని యిట్టిసౌందర్యమున కుసికట్టగు నవమన్మ ధాకారుని గాంచఁ జాలనైతి? ఔరా! ఏమి వీని సౌందర్యము

[అనుబంధము 18]

ఉ. కంతునికంటె నైషధుని ♦ కంటె వసంతునికంటె యామిని కాంతునికంటె దస్రుని ♦ కంటెఁ గుబేరుని పట్టికంటెఁ బా కాంతకసూతికంటె లలి ♦ తాకృతినొప్పుచునుండు, మేదినీ కాంతుఁడటంచు నాకు చెలీ! ♦ కాంతులుగల్గెన వేయుకేటికిన్

చెలీ!

ఉ. "వీని ముఖంబు చందురుని ♦ వెల్వెలఁ బారఁగఁ జేయుచుండఁగా
వీనివిలోకనంబు లర ♦ విందములన్ ముకుళింపఁజేయఁగా
వీని భుజద్వయంబు ఫణి ♦ వృద్ధుని నొదలఁజేయఁగా
వీనివిలాససంపద తి ♦ వి(?)ష్టపసన్నుత మాటదిత్రిమే?"

మరియు

కం. చిందమ్ముల కుందమ్ముల
కందమ్ముల గెల్చువీని ♦ గళ రద కచముల్
కెందమ్ముల కుందమ్ముల
చందమ్ముల దనరువీని ♦ చరణము లెన్నన్."

చెలి—రమణీమణీ! చక్కఁగా వర్ణించితివి. నీవు చెప్పినట్లన్ని లక్షణము లచే విలసిల్లుచుండె. ఈతఁడే నీకుఁ దగిన పురుషుఁడు.

చంద్రి—కాంతా! ఈతని సూకృతి చూడ మోహాబ్ధమున ద్రియున ముంచుచున్నయది. ఇంక నీమోహము నేభరింపఁజాల. ఇటు దిలకించుము.

సీ "వదనపవిభూత లా ♦ వణ్యాంబుసంభూత
కమలంబులన వీని ♦ కన్ను లమరె
నిక్కి వీనులతోడ ♦ నెక్కసక్కెములాడు
కరణి నున్నవి వీని ♦ ఘనభుజములు
సంకల్పసంభవా ♦ స్థాన వీటికవోలె
వెడదయై కనుపట్టె ♦ వీనియురము
ప్రతిఘటించు జివుళ్ళ ♦ పై నెత్తివాటిన
రీతి నున్నవి వీని ♦ మృదుపదములు

గీ. నేరెటుటియసల్ దెచ్చి ♦ నీరజాప్తు
సానబట్టిన రాపాడి ♦ చల్లి కెంపి

వదను సుధ నిడిచేసెనో? ♦ పద్మభవుఁడు
వీనిఁ గాఁ గన్నఁ గలడె ? యీ ♦ మేనికాంతి."

[కాంతుఁడు మేల్కాంచి]

కాంతలారా! మీరెవ్వరు? మీనామమెద్ది ? ఇందు రాగత మేమి?

చెలి—ఆర్యా ! ఈమె కళింగాధీశునిపుత్రి, చంద్రరేఖ. మే మీమె యనుంగుసఖులము, వనవిహారార్థమై యిందువచ్చితిమి. మీ నామమెయ్యదో? స్థానమెయ్యదో? కులగోత్రము లెవ్వియో? సెలవీయ వేఁడుచున్నారము. మీకుఁ గళ్యాణమగుఁ గాక.

కాంతు—(స్వ) ఏమి ! యీ చెలి యిట్లు భాషించుచున్నది ? (ప్ర) కాంతా! రాట్కులసంజాతుండ. కుంతలపురీశుని పుత్రుండ.

చెలి—దేవా, తమనామమును దెలుప ప్రార్థించుచుంటి.

కాంతు—నా కులగోత్రనామము లడుగుచుంటివేల? నాతోడ సంబంధ మొనర్చెదవా ?

చెలి—(నమస్కరించి) దేవా! యాగ్రహింపకుడు. ఒక మనవిగలదు మీ రంగీకరింతురేని యుగ్గడించెద.

కాంతు—అంగీకరింపఁదగినదైన నంగీకరించెదను,

చెలి—(చంద్రరేఖనుఁజూచి కన్నుగీటును.)

చంద్ర—ఆర్యా! ఈకళింగపురాధీశ్వరుండగు మాతండ్రి ముదుసలి యగుటచే రాజ్యతంత్రము కుశలముగ నడుపఁదగు రాకుమారుఁడు లభింపమిచేసి సంతాపమందుచుండె, మరియు నా—

[తలవంచి సిగ్గువడుచు]

కాంతు—తరుణీ!లజ్జించెదవేల? యిది లజ్జించుటకదా? చెప్పఁదలచిన దాని సాంగముగాఁ జెప్పుము, ఇం దన్యు లెవ్వరుండిరి?

చెలి—అయ్యా! ఈరాజ్యభారమును మీభుజస్కంధముల నిడుకొని యీమెను వివాహంబుడుమని యీమెకోరిక, మీరిందుల కంగీకరించి యీమెనుఁ జేపట్టవలయును.

చంద్రి—(చెలికత్తెను చాటుచేసికొని) భూజానీ. ఇదియే నాకోరిక. ఇంక నాముద్దుచెల్లించి నాకును యీకళింగరాజ్యలక్ష్మికిని నాథులగుదురుగాక యని ప్రార్థింపుచుంటిని.

కాంతు—సఖీ! నీకోర్కెయందొంకు తీర్చెదను. రెండవదాని యర్థవత్సరమునకుఁగాని దీర్పఁజాల, మన్నింపుము.

చంద్రి—ఆర్యా! ఇట్లుసెలవీయఁదగునా? మీరిట్లు దీర్పఁగల్గిన కార్యమెద్దియో సెలవీయవేడుచుంటిని.

కాంతు—కలికీ! నీతండ్రి వృద్ధుడగుటచే రాజ్యభారము మోయఁజాల కుండెనని వల్కితివిగదా? కాన ప్రస్తుతమందీరాజ్యరమకు నాయకుఁడనై ప్రజాపాలనముఁ జేసెదను గాని యారుమాసము లవఱకు నిన్నుఁ బరిణయమాడఁజాల.

చంద్రి—కారణము సెలవీయ వేడెద.

కాంతు—ఏమని చెప్పుదును. ప్రియకాంతావియోగము సంభవించుటం జేసి యీగుప్పుఁ జెప్పితిని.

చంద్రి—కాంతావియోగము మీకెట్లు గల్గె?

కాంతు—కాలవశమున ఘోరాటవులఁ దిమ్మరుచుండ నంను ప్రియకాంతను గోల్పోయి యెంతైన నున్నజాడ కనుగొందమని యిట్లు దిమ్మరుచుంటి. కానిమ్ము; నీకోర్కెదీర్చ రాజ్యపాలన జేయుచు నిందేయుండి నాకాంతను వెదకఁదగు వారింబనిచెద.

చంద్రి—చిత్తము. తమదయ.

చెలి—అమ్మా! చంద్రరేఖా! చాలా జాగైనది. రమ్ముపోవుదము.

చంద్రి—ఆర్యా! పురమునకుఁ దయసేయుఁడు.

కాంతు—మంచిది పోదము.

చంద్రి—రండుపోవుదము. (అందఱు నిష్క్రమింతురు)

(యవనికజారును.)

---

## తృతీయరంగము— రాజాస్థానము.

[ప్రవేశము:— కాంతుఁడు ఆసీనుఁడై]

### రాగావతారసీసము.

అహా! యేమినాగతి?

సీ. శంకరాభరణంబు ♦ జగతిభారముఁదాల్చి
రీతి భూభార మే ♦ రీతిమోతు?
మోహనాకార నీ ♦ ముద్దుమోమును జూచు
భాగ్య మెప్పటికల ♦ భ్యంబుగల్గు?
భూపాలచంద్ర యా ♦ పాపపువిధియష్ట
కష్టముల్ పాల్ జేసె ♦ గాదెనన్ను?
కన్నడ యేల? నర ♦ గాచిరక్షించుట
కిది మంచిసమయ ♦ మిఁకేలజాగు?
గీ. తోడివారలుజాల సం ♦ తోషవార్ధి
నోలలాడుచునుండిరి ♦ యోవరిలక
వాలిమీక మీపదంబుల ♦ నోలగించు
భాగ్యమబ్బునో లేదో ♦ యీపాపికింక!

అహా! నేనట్టి నిర్భాగ్యురాలనా? పడరాని యిడుమలఁ బడి నేటికి కపటవేషధారినై కాంతుఁడనుపేర కాలము గడుపుచుంటి. నాకపట కృత్యమెఱుంగక చంద్రరేఖ తన్నువివాహమాడుమని పల్కుచున్నది. ఆమె సుందరవదనారవిందముగాంచినప్పుడెల్ల లజ్జించుచుంటి. నేఁజెప్పిన గడువు సైతము తుదముట్టవచ్చినది. నాప్రాణకాంతునిజాడ నెందును గాన్పింపదయ్యె. ఇంక నేనేమిసేయుదాన? నాకింక దిక్కెయ్యది?

ఓలక్ష్మీవల్లభా! లోకనాయకా! ఆర్తజనశరణ్యా! ఇంక నా నాధుని నాకుంజూపకున్న నీప్రాణములఁ బాయుదాన. ఓజనార్దనా

కంసమర్దనా! పతితుల వెట్టినన్ను రక్షింపుమా! కరుడసైంధవా! వైకుంఠ వాసా! దిక్కులేని నాయట్టి దీనురాండ్రకు నీవేకదా దిక్కు? పుండరీకాక్షా! యింక రక్షింపుము. (చూచి) ఎవడురా?

[ప్రవేశము, సేవకుడు]

అయ్యా! సేవకుఁడు.

కాంతు—ఓరీ! నీవింక కారాగృహము చెంతకు జని యాకారాగార కుడ్యముపై వ్రాసిన చిత్రపటముఁజూచి యెవ్వరైనను దుఃఖించినను మోహించినను ఏకదృష్టిఁజూచినను వారినెల్లర కారాగృహమునందుంచుము. ఇదియే నాయాజ్ఞ! జాగ్రత, మరచితివి. ఎవ్వరేని మాని వేషధారులు వచ్చిన వారిని సన్మానించి యుచితాసన మొసంగుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

కాంతు—నే నించుకంత విశ్రాంతిఁ జెందఁబోయెద.

[నిష్క్రమించును యవనిక జారును]

---

తురీయరంగము—కారాగృహము.

[ప్రవేశము:—సేవకుఁడు. ఖడ్గహస్తుఁడై]

రాజులయెడ సేవకావృత్తి మిగుల కష్టతరము. "కోపమువచ్చిన కొంటెకు చంపుదురు. లేనిచో పాలకుఁ చంపుదుర" ఎట్లైనను చావే? ఆజ్ఞ! "ఈచిత్రపటముఁ జూచిదుఃఖించువారిని కారాగృహమునందుంచ"మని, ఇచటికి నేకులు వచ్చిరిగాని యీపటమును జూచి దుఃఖించినవాఁ డొక్కఁడును లేఁడు. ఇందుఁ గాచియుంచ లేక చచ్చిపోవుచున్నాఁడ. ఇందీపటము వాడావుగా బెరవ్రాసినారు. ఇందునిందఱుండ గావలికి నేనేదొరకితినా?

(ప్రవేశము—ఉత్తమశీలుఁడు)

[అనుబంధము 19]

(చిత్రపటమునుగాంచి) హా! తరుణీ! కాంతామతీ! మానపోయితివే?

సేవ—ఎవరు నీవు?

ఉత్త—నేను వైశ్యుఁడను.

సేవ—ఈపటముంజూచి యేలదుఃఖించెదవు ?

ఉత్త—అయ్యా ! ఈమె యిప్పు డెందున్నయది ?

సేవ—కావలెనా ? చూపెదరమ్ము. (అని కారాగృహమందుంచును)

[ప్రవేశము—దుష్టబుద్ధి]

(అనుబంధము 20)

(చిత్రపటముగాంచి) హా ! కాంతా !

సేవ—ఓయీ! నీ వెవ్వఁడవు ?

దుష్ట—నేను క్షత్రియుండను.

సేవ—ఈపటముఁజూచి యేలదుఃఖించెదవు ?

దుష్ట—ఆమె నాభార్య. అంతే చేత,

సేవ—ఐన యామె నీకిప్పుడు కావలెనా ?

దుష్ట—అయ్యా! యెందున్నది? కావలెను. చూపితివేని నీకు పారితోషిక మొసంగెద.

సేవ—అటులైనరమ్ము. (కారాగృహమందుంచును)

[ప్రవేశము—దొంగ.]

(అనుబంధము 21)

ఆ. గంతా! గంతా!

సేవ—ఓరీ ! ఏలయేడ్చెదవు ?

దొంగ—గంత. నాగంత.

సేవ—నీకాగంత కావలెనా ?

దొంగ—ఆ. కావాల. ఏదీగంత ?

సేవ—వినరమ్మా. (అని కారాగృహమందుంచును.)

[ప్రవేశము—రాజపుత్రులు].

(అనుబంధము 22)

(చిత్రపటముం గాంచి) హా! తరుణీ! నన్ను మోసముఁ జేసి యుంటివి?

సేవ—ఎవరు మీరు ?

1, 2 మేము రాచబిడ్డలము.

సేవ—ఈ పటముం జూచి యేల దుఃఖించెదరు?

1, 2 మాకీ కాంత గావలెను, ఎందున్నది?

సేవ—నిజముగ గావలెనా ?

1, 2 కావలెను.

సేవ—వినరండు. (అని కారాగృహమందుంచును)

[ప్రవేశము—ప్రతాపసేనుఁడు, సన్యాసి వేషమున]

(అనుబంధము 23)

హా! ప్రాణేశ్వరీ! ఎందుంటివి? (చిత్రపటముం జూచి దుఃఖించును)

సేవ-యతికులేంద్రా! నమస్కారము. ఇయ్యది యాసనమలంకరింపుఁడు.

ప్రతా—మంచిది. (కూర్చుండును)

[ప్రవేశము—కాంతుఁడు ఒకవైపున]

కాంతు—(స్వ) ఈతని రూపలావణ్యములంజూడ నా కాంతునివలెగన్పట్టుచున్నాఁడు. నిదానించిన సర్వమును బయలుపడును. (ప్ర) తాపసేంద్రా! వందనములు. ఇంచుక విశ్రాంతిఁ జెందుఁడు. సేవకా! ఈ పటముం జూచి దుఃఖించినవారి నెల్ల కారాగృహమందుంచితివా? (ఆసీనుండగును)

సేవ—చిత్తము.

కాంతు—వీర వొండ్రవకునగఁ దోడితెమ్ము. విచారించెద.

సేవ—చిత్తము. (ఉత్తమశీలుని వెలుపలకుఁ దీసికొని వచ్చును)

కాంతు—ఓయీ! నీ వెవ్వఁడవు?

ఉత్త—నేను చేరివంశజుఁడను.

కాంతు—ఈపటముంజూచి దుఃఖించిన కారణ మేమి?

ఉత్త—అయ్యా! ఈమె నరణ్యమున నొక సేవకుఁడు విడిచిపోవుచుండ వానికి నేకొంతధనమిచ్చి యీయమను గొంటిని. పిదపనన్నుం గూడుమని యీమెను నే నిర్బంధించ నామహాతల్లి నాకుబుద్ధి వచ్చునట్లునీతులఁ జెప్పినది. అంత నే నజ్ఞానమును విడిచి సుజ్ఞానముధరించి, అమ్మా! సాధనమెట్లువచ్చునని ప్రార్థింప నామె వ్రేలినుండు యంగుళీయక మొకటిచ్చి దీని విక్రయించుకొమ్మని చెప్పినది. అంత దానిం గైకొని యొక రాజసన్నిధికిం దీసికొని పోవ వారదిగని గ్రహించి నాకు ధనమీయక యే బారదోలె. అంతనేను నాద్రవ్యము పోయెగదాయని మతిభ్రష్టుఁడనై జరించుచు నేటికీపురముఁ జేరితిని. ఇందాతల్లి యీపటంబు గన్పడఁ జూచి దుఃఖించితిని. అంతియెగాని వేరేమియు నే నెఱుంగ.

కాంతు—మంచిది. ఆవలుండుము. యతిరులేంద్రా! ఇందు మీయభిప్రాయ మెట్లుగానుండెను? సెలవొసంగుడు.

యతీ—ఈతఁడు ద్రవ్యముగోల్పోవుటచే మతిభ్రష్టుఁడనై తిరుగుచుండె అట్లనే జరుగవచ్చునని నాకుందోచినది. మఱియు నామెకు యీతనికి నేమియు సంబంధముగల్గినట్లు నాకుఁ దోచకున్నయది.

కాంతు—మంచిది. ఓయీ నీవావలుండుము. సేవకా! తర్వాతవానిం దోడ్కొనిరమ్ము.

[సేవకుఁడు దుష్టబుద్ధిని వెలుపలకుఁ దీసికొనివచ్చును]

కాంతు—ఓయీ! నీ వెవ్వఁడవు?

దుష్ట—నేను రాజకులోత్తముఁడ.

కాంతు—నీవు రాజకులోత్తముఁడవా? ఐననీవా పటముఁగాంచి దుఃఖించనేల ?

దుష్ట—ఆమె నాభార్యగాన—

కాంతు—(కోపముతో) నీచా ! నిజముగ నీభార్య యేనా? సత్యముఁ జెప్పుము. లేకున్న శిక్షింపఁబడుదువు. ఆమె యిందేగలదు. నీవసత్యముఁబల్కితివేని యామెనిందు రావించి నిజమారసి శిక్షించెద. జాగ్రత, నిజముగ్గడింపుము. క్షమింపఁబడుదువు.

దుష్ట—(భయముతో) అయ్యా! నాభార్యగాదు, ఆమె నాపట్టణమునకు వచ్చినది. అంత నేనామెను నిర్బంధించి నాకోర్కెఁదీర్పుమంటిని. అంత నామె యిట్లు బల్కినది. "నేను గౌరీవ్రతము సల్పవలెను, అది సల్పుట కారుమాసముల యారుదినములు జరుగును. అందుల కనేక దానము లీయవలయు. దాని కగు వ్యయము నీవొసర్చిన నీకోర్కెలభించెద" నని చెల్ప నేనందులకు నా బొక్కసమందుగల ధనమంతయు వెచ్చించితి. పదఁపడి రాజ్యము సైతమితరరాజుల యాధీనముఁజేసి ధనముఁగొని తెచ్చి యామెకడకుం బంపుచుంటిని. ఇట్లారుమాసములు జరిగినవి. తరువాత నాకడద్రవ్యము సాంతమైనది. ఆమెయు నా యారుదినములు జరుగకమున్నె యెందో పారిపోయినది. ఎచ్చెనైన నామె దర్శనమైనఁజేసికొందమని రాజ్యభ్రష్టుఁడనై యిట్లు ద్రిమ్మరుచుంటిని. ఇందామెరూపపటంబు గన్పడ దానింజూచి దుఃఖించితిని, అంతియెగాని వేరేమియు నేనెఱుంగ.

కాంతు—ఆర్యా! ఇందు మీ యభిమతమేమి? సెలవొసంగుఁడు:

ప్రతా—ఈతఁడును రాజ్యమును ద్రవ్యమును గోల్పోవుటచే నిలువ నీడలేక యిట్లుగా ద్రిమ్మరుచు వచ్చెనని నాయభిప్రాయము.

కాంతు—ఇతని విషయమై మీ కేమియు ననుమానము లేదుకదా ?

వ్రితా—ఇతనియెడ దోషమున్నట్టు నాకుదోచుటలేదు.

కాంతు—మంచిది ఓయీ! నీవావలకుంబొమ్ము సేవకా! తరువాత వానిఁ దోడ్కొనిరమ్ము.

(సేవకుఁడు దొంగను వెలుపలకుఁ దీసికొనివచ్చును.)

కాంతు—ఓరీ ! నీవెవ్వఁడవు ?

దొంగ—నేనా? ముచ్చటగాణ్ణి.

కాంతు—అనగా నేమి?

దొంగ—దొంగతనమే ?

కాంతు—నీవీ పటముఁజూచి యేడ్చిన దెందులకు ?

దొంగ—ఇదే నేనే దొంగతనానికి పోయేతలికి మేడమిందకూకొని ప్రాణేశా ! అన్నది. ఆమ్మాయిన్నేను ఊఁ:అన్నా. ఆమ్మాయిని హైనించి దిగొచ్చింది. అప్పుడు నేనుమెల్లెంగఅడియికితోవతీశా. ఆమ్మాయిని అది నా యనకే వత్తుండది. అట్టపోయి అట్టపోయి అడియి మద్దెకు తీసికెళ్లే. ఆమ్మాయిని నన్ను పెళ్ళిచేసుకోమని కదలకుండ అడ్డంపొయ్యా. ఆమ్మాయిని యేందేందో చానాచెప్పింది. అయెన్ని నాకుతెల్దు. పెళ్లిసేసుకుంటావా లేదా? అంటాదగ్గిరపోయా ఆమ్మాయిని—

కాంతు—ఛీ ! వెధవా ! ఏంమ్మాయని నీముఖంమ్మాయని.

దొంగ—ఆ, నీమొకంమ్మాయిని—

కాంతు—ఛీ! బుద్ధిహీనుఁడా! శరీరముదగ్గరనుంచుకొని మాటాడుము.

దొంగ—మరిగత్తే ఆమ్మాయిని—మరిసిపొయ్యా కూసేపుండు,

కాంతు—ఊఁ, దగ్గరకుపోయినావు.

దొంగ—మరిగత్తే, ఆమ్మాయిని నీకునుంచి దాసుకొల్లేవు. అయ్యోనుకు నిరామని సెప్పింది.ఆమ్మాయిని నేను మాయింటికెల్లియాడదాసుకు

లేసుకొని మావాళ్ళందరిని బిల్సుకొని బుక్కాయిగిక్కాయి
గీసుకొని అడికొచ్చేతల్కి అదేమందది? ఆమ్మాయిని—

శాంతు—(దెబ్బకొట్టి) ఛీ వెధవా! దబ్బునఁదేల్చి చెప్పుము.

దొంగ—అమ్మాయిని మావాళ్లంతా నన్ను దొంగెదవా! దొంగమాటలు సెప్తావా మీకని తలాకదెబ్బాయేశారు. ఆమ్మాయిని నేను యేడుత్తు అడిఁబునిబడివత్తావుండా. యెవ్వైన దాన్ని పెళ్ళి సేసుకోవాలని వాఁచొచ్చిచ్చి ఆగోడమింద దానిబొమ్మకనిపిచ్చేతలికి ఆమ్మాయిని యేడుపొచ్చి జోర్నేడ్చేతలికి మీాయదవలొచ్చి నన్ను గట్టిగా పట్టుకొని నీకు దాన్ని యిత్తాంరామని సెప్పి ఆమ్మాయిని కిటికీలో కూకుండబెట్టేరు. అాదులో యిాళ్లంతావుండారు ఆమ్మాయిని—

శాంతు—ఓరీ! తలదొచ్చుచున్నది గదరా! యింకమాటలాడక అవలుంచుము. పొమ్ము.

దొంగ—అంతా సెప్పొద్దుమరి—

శాంతు—(దెబ్బగొట్టి) అవలకుబొమ్ము జాగ్రత్త. (వరితావసేనుంజూచి) అయ్యా! వీనినిగూర్చి యేమిచెప్పెదరు?

వరితా—వీఁడు చోరుఁడగుటచే ద్రవ్యాపేక్షవలన నిట్లు మాయలంబన్నెగాని వీఁడామెయందేమియు కపటమవలంబించి యున్నట్లు నాకుదోచకున్నది.

శాంతు—మంచిది. ఓరీ! నీవావలకుంబొమ్ము. సేవకా! తరువాత వానిఁదెమ్ము.

(సేవకుడు రాజకుమారుల వెలుపలకిఁ దీసికొనివచ్చును)

శాంతు—మీరెవ్వరు?

1, 2 మేము రాచబిడ్డలము.

శాంతు—ఇందేలవచ్చితిరి?

1, 2 అయ్యా! కొన్నిమాసములక్రిందట మేమిరువురము మృగయా వినోదార్థమై కానన భూమి కేగితిమి. అందొక తరుణిం గాంచి యామెపై మోహముగల్గి యామెను నిర్బంధించితిమి? కానియా బిడ మాకెన్నియోనీతులు దెల్పినది. మేమా నీతులు విశ్వసింపక యామెపోవు మార్గము నిరోధించితిమి. అంత నాయువ యిట్లుపల్కినది. "రాజకుమారులారా! నేనొక్కటిఁ దెల్పెద వినుడు. మీ యుడుపులిందు విడచిపెట్టుడు" అన మే మట్లు జేసితిమి,

కాంతు—మంచియుక్తి బన్నినదే. పిమ్మట?

1, 2 పిమ్మట యాశరమును విసరివేసెదను. దానిముందు తెచ్చిన వానిఁ బెండ్లాడెదనని పల్కి శరమును వేగముగ విసరివేసెను. అంత మేమాశరము కొఱకై పర్వులిడి శరముం గైకొనివచ్చు నప్పటికి యామె మాయుడుపులను రెండవశరమును గైకొని యెందో జనినది. మే మందులకుఁగినిసి దుస్తులు గోల్పోయి పురము చేరుటకన్న యాకాంత యెందుగలదో నెమకి ప్రార్థించి మరల దుస్తులగైకొనుట మేలనిదలఁచి మార్గముఁబట్టి యిచ్చటికి చేరితిమి. ఇందామెరూపపటముఁగాంచి దుఃఖించితిమి. అంత మిమ్ము కారాగారవాసులుగఁ జేసిరి, ఇంతియేగాని వేరెఱుంగము.

కాంతు—మంచిది. అయ్యా! ఇందులకు మీయభిప్రాయమేమి ?

ప్రీతా—తొలుతవీరు మోహముచే దుష్కార్యమునకుఁ బాల్పడి యు కపటోపాయమున నాకాంత దుస్తులఁ గైకొనిపోవుటచే కాంత లభింపకున్నను దుస్తులైన లభించిన మేలని దలఁచి యిట్లుగా నాకాంతకై ద్రిమ్మరుచున్నట్లు స్పష్టమైనది. కాని వీరికిని యాకాంతకును సంబంధమేమియు లేదని తేటపడినది.

కాంతు—మంచిది. సంతసించితిని.

ఓయీ! బుద్ధిహీనురాలా! ధనతను మదాంధతచే కన్నుమిన్ను గానక చిన్న పెద్దలని యెంచక పరనారులని దలంచక విఱ్ఱవీగకుఁడు. ఈపురమున కెవ్వరైన పథికులమ్మున వచ్చినవారిని నిర్బంధించి పాప మార్జింపక సద్బుద్ధిగల్గి మెలంగుఁడు. చిన్నతనపు చేష్టలు మానుఁడు. కీర్తి సంపాదింపుఁడు. భరతమాతను దుఃఖపెట్టకుఁడు. (ప్రతాపసేనునిం జూచి) అయ్యా! వీండ్రవలన నేలోపము లేదని సెలవిచ్చినారా?

ప్రతా—ఏలోపమును లేదు.

కాంతు—ఇంక వీరికి సెలవీయఁదగునా?

ప్రతా—ఆఁ నిరాటంకముగ.

కాంతు—మంచిది. అయ్యా! తొలుత కాంతుని గోల్పోయి యిట్టి కష్టములందిన కాంతనుమరల ప్రాణకాంతుఁ డంగీకరింప నేమైన సందియముండునా? ఉండినఁ దెల్పుము?

ప్రతా—లోపమేమియు లేక దన పాతివ్రత్యమునుఁ గాపాడుకొనిన కాంత నేల నంగీకరింపఁడు. ఆమె యేల యంగీకరింపఁబడదు?

కాంతు—నాథా! నిద్రాహారంబులు లేక ఇన్నికష్టములంది యీపురముఁ జేరి పురుషవేషమున కాలము గడుపుచున్న నిర్భాగ్యురాలగు కాంతామతిని నేనే. ఇంక కరుణింపుఁడు.

(అనుబంధము 24) (కాళ్ళపై బడును)

ప్రతా—(ఆశ్చర్యముగ) తన్వీ! నిజముగ నీవు కాంతామతివా?

కాంతు—నాథా! తమ సెలవయ్యెనేని పూర్వరూపముఁ జూపెద.

(స్త్రీరూపముఁ జూపును)

[ప్రవేశము: చంద్రరేఖ, చెలికత్తె,] (ఒకవైపున)

కాంతా—సోదరీ! ఇట్లాశ్చర్యమునఁ జూచెదవేమి? ఇంతకాలము

నుండియు,

గీ॥ పురుషరూపంబు ధరియించి ♦ పుడమి నేలి
కాంతుఁడను పేరఁ బరగి నీ ♦ స్వాంతమునకు
సంతసము గూర్చి యుంటి బల్ ♦ వింతగాను
చంద్రరేఖ! సహోదరి! ♦ సంగతిదియె.

నే నాఱుమాసంబులు గడువు చెప్పిన దీమహనీయుఁడగు నాప్రియకాంతునికొఱకు. మఱియు నే నిదివఱకుఁ బడినకష్టములెల్ల నాచే నిప్పుడు విచారింపఁబడిన పంచమహాపాతకులను నీవైదుగురివలననే. వీండ్రం జూచితివా? నీచాత్ములు.

ప్రతా—ప్రియకాంతా! కాంతామతీ!

చ॥ కలికిరో! నీగుణంబులను ♦ గన్గొననేరక వేశ్యమాటల
ఖిల నిజమంచు నమ్మి నిను ♦ వీడితి కానకు మందబుద్ధినై
భళి! యన లోకమెల్లరును ♦ బాగుగ రాజ్యము నేలి దుష్టుల
లలనరో! శిక్షచేసితివి ♦ లక్షణవంతులు జూచి మెచ్చఁగన్.

ప్రియా! నేనొనర్చిన దుష్కార్యముల మనమునం దెంచక నన్ను గావుము.

కాంతా—నాథా! ఇందు మీరేమిచేసితిరి? ఇదియంతయు విధివశమున జరిగినది. ఇందులకు మీరు చింతింపకుఁడు. మఱియు నీకోమలాంగి మీమృదుకరపల్లవముం బట్టి సుఖింప మీకొఱకై నిరీక్షించుచున్నది. ఈమెం జేపట్టి కృతార్థురాలఁ జేయ ప్రార్థించుచుంటిని.

చంద్ర—ఆర్యా! నన్నును యీకళింగ రాజ్యలక్ష్మినిఁ జేపట్టి సుఖంప వేఁడుచున్నదాన. (నమస్కరించును)

ప్రతా—రామామణీ! నీకోర్కె నెరవేర్చు యట్లనే యంగీకరించెద లెమ్ము.

కాంతా—నాథా! శుభస్య శీఘ్రమ్మనునట్లిప్పుడే శుభముహూర్తము గూడదాపు జేరినది గావున యింకజాగు సేయకుము. సేవకా!

(ప్రవేశము; సేవకుఁడు)

సేవ—సెలవు.

కాంతా—సత్వరంబుఁ జని రెండుచిత్రాసనములందెమ్ము

సేవ—చిత్తము (నిష్క్రమించును)

(పునఃప్రవేశము; సేవకుడు కుర్చీలతో)

కాంతా—నూతనదంపతులారా! ఇయ్యాసనము లలంకరింపుడు.

ప్రియ—
చంద్ర— } [వాటిపైఁ గూర్చుందురు]

కాంతా—(కర్పూరము వెలిగించి)

మంగళము [లొల్యా

మానినులుభూస్థలిని ♦ మాన్యతగడించిప్రియ ♦ మంజులవచోమృతము
బూనుకొనిభర్తలకు ♦ బూజలొగిఁజేసియిల ♦ పుణ్యవతులయ్యెదరుగాతఁ
జానలనుబూరుషులు ♦ సంభ్రమముగగ్గైకొనియు ♦ ఇక్కగనుఖంబెదరుగాతఁ
మానవతులైన రతి ♦ మారసములిద్దరకు ♦ మంగళము! మంగళమహాశ్రీ॥

ధాత్రియందు భరద్వాజ ♦ గోత్రయుతుఁడు
కరము గూడూరి వంశ్యుఁడు ♦ ఘనయశుండు
మల్లయార్యుని పౌత్రుండు ♦ పూజ్యతముఁడు
అరయ వేంకట శివకవి ♦ కాత్మజుండు
నిచ్చ దీని రచించె గో ♦ టీశ్వరుండు.

(యవనిక జారును)

సంపూర్ణము.



# అనుబంధము

కాంచ— హిందూస్థానితోడి-ఏకతాళము.

ఆహాహా! యీజగతికిఁ జూడఁగ వేశ్యలె ధీరులుగా? ॥ఆ॥
ముదంబుజూడఁగ-మదంబుదీయఁగ-మొదందలచిచూడంగ ॥ఆ॥
ధనములాగఁగా-దగువారెవరిల-తగినవారలే వేశ్యలుగా?
ఈయిల తగినివారలే వేశ్యలుగా? యీయిల తగినవారలే వే
శ్యలుగా? వేషముల్-భావలఁ-వేసియుఁ-జాలగా ॥ఆ॥

---

మిత్రా— 2 హిందూస్థానికాఫీ-ఏకతాళము.

కలికీ మిటారీ! కాయజు కిటారీ;
అలుకాలేల నీకు?-బలుకాకనాతో?
కాంచనమాలరో!-కదుకోవమేలనే?
కాయజబారికి తాళఁజాల-మోహనాంగిరో! వేడెదజాల
నఁ బాయుటకిది మేల?-సుగుణశీల-యిది మేల-వినుబాల ॥ఆ॥

---

కాంచ— 3 డైలాగ్.

వినువిను వినుసిద్ధి వాహికమున్-వినియు కసికో-వేశ్యను
వీడుమ్ వినకయున్ననివు-చెడకపోవుదువు-వేదవాక్యమిది
వినుమింకఁ!

---

మిత్రా—చాలుచాలునీ-సంగతిదెలిసెఁ-యేలబల్కెదవు? గురువని
నిన్నివేళ కాదితిని-వడగుమానుమిక-పెరలుబల్కనిటున
టుకకుందునే! ॥చా॥

వేశ్యలు— 4 పా॥ డ్యాన్సు,

మహారాజ సుగుణాధారా - మముబ్రోవుము శశిర
గావఁ - కరుణఁ వేగఁ - మముగను (మా) ॥మ॥
నీ సరియెవరీ - భూస్థలి గనుగొన
భాసురగాత్రా! - వరపవిత్రా!
వాసిగఁ - చేకొనఁ - దగునికఁ - నీమదిఁ - రయమున ॥మ॥
మాదగు కోర్కెల - మహిఁదీర్చియువడి
సాదరముగ మము - సాకుము వేగ - జగదాధారా ॥మ॥

---

కాంత— 5 హిం॥ తోడి - రూపకతాళము

ఏమిసేతు? దైవఘటన - యెందుఁబోదు నేనిఁక ...
కామితార్థదైవరాయ - కనియుఁబ్రోవవా...
నేరమేమి చేసియుంటినో? - నే నెఱుంగనే...
ధీరస్వాంత! ప్రాణకాంత! - దీననేలవా ...
కారగార మందునుంచుట - కారణంబదేమిహా...
నేరమున్న వేరుశిక్ష - నేర్పరించరాదొకో... ॥ఏ॥

---

కాంచ— 6 బేహాగ్ రాగము - ఏకతాళము.

అహా! మామారమ్ముల చెలియ నవ్వారితరమా నిల? ॥అ॥
ఇలమోహంబులో - బలువేసంబులఁ - బడివేయుచునుఁ
ధనమార్జించగన్ - కామితఫలముంచుచును - కాలంబుగడు
పుచుంగదా? ॥అ॥

---

కాంతా— 7 హిం॥ తోడి - రూపకతాళము.

నాథా! గహనబాధా! సైపగలేనే? నా॥
చెరసాలలోనన్ను - జేర్చి బాధించితే
నరక వనములకంత - భావ్యామసీకది॥ నా॥
ఎటుబోదు నేనింక? ఈపరింకదిక్కెవ్వరు! నా॥
కటకట! నాకిట్లు - గల్గునంచెఱుగనే॥ నా॥
తల్లి దండ్రులు నమ్మి - యుల్లము హర్షింప
కల్లమాటలఁ జెప్పి - నిల్లాలి కీపాట్లు. నా॥

---

ఉత్త— డైలాగ్.

మోహము,దీర్పవెందుబోదువే? కల్కిమితారీ! కంతునికటారీ! మో॥
కుందరదనా! యిందువదనా! మందగమనా! వినగదే॥
సుందరీ! నిన్ - విడువఁజాల - పొందకుండ నేనిఁక నే॥ మో॥

---

కాంతా—ఛాఛా సీచీ! సరసముదెలసెగా — సఖులను గో
రగదగునా ఛీ
పరనారీ మణులగోరా-దురితమా - నరకమా - దెలియవా?
ఉత్త—దురితమునరకమదెందుంగలదె. దూరముసుఁజెడనేలనే? బాలా
కాంతా—సరసుల కదియగా - సరగున దెలియగా - చాల్ చాల్
ఛీపో - సరగున సీచీ ?
ఉత్త—సరసుడనే నీ- విరసము లేలనే? సరగున చెంతకు రా॥ రా॥ రా॥
కాంతా—దురితము కావ్యము - దూరముసుండుమ - దుష్టుడ
ఛీ ఛీ పో.

9 డైలాగ్.

దుష్ట—చాల్ చాల్ నారీ! రాజకుమారీ.
కాంతా—వలను ఛీ పోరా నన్నిటు కోరతీరా
దుష్ట—సఖ వినవా?
కాంతా—ఓరి నీవు మనవా?
దుష్ట—బరహింసలు - కాంతరో పాపముగాదా? యిల
కాంతా—పరనారిని - కోరుట - పాపముగాదా? ధర
దుష్ట—కరసజవాదువా ?
కాంతా—కూ్రరనీవెఱుఁగవా ?
దుష్ట—సరి సరి కాంతా! పరసకురావా ?
కాంతా—పరసము జేరా! పరగునపోరా ?
దుష్ట—నారీ! వయ్యారీ! చిన్నారీ! మితారీ!
కాంతా—యేలను ఛీ పోరా! నన్నిటు కోరతీరా!
దుష్ట—చాల్ చాల్ నారీ! రాజకుమారీ!

---

చరిత్రా— 10. బేహాగ్ రాగము - ఆదితాళము.

వేశ్యలఁగూడుట వెతలగునండీ- వెడగుమానుడిక - విటులందరును॥ వే॥
మోహముఁ జూపించి - ముద్దులఁదినిపించి - మించియు తేల్చు
రుగా ? విటులకా - ముంచియు తేల్చురుగా? ॥ వే॥
మాన్యములమ్మించు - రాజ్యములమ్మించు - యిల్లూ వాకిలీ
నున్నా - విటులకుయిల్లూ వాకిలీ నున్నా ॥ వే॥
దాసునిగాజేసి - వాసియుఁదెగగోసి - వరుసగ క్షౌరముఁ జే
యుగా - వేశ్యల్ వరుసగక్షౌరము జేయుగా ॥ వే॥

---

కాంచ— 11- 10 పాటయే.

---

చిత్రా— 12 హిం॥ తోడి-ఏకతాళము.

అకటా! యెటగాంచెదను? నాప్రాణేశ్వరినే ॥న॥
క్రూరుడనయ్యనే - ఘోరగదోలితి॥
వారినివనమునకు - గురుపాపుడనై ॥యె॥
మానినియెుందైన - మనితివో లేదో కా?
కాననమృగములువే - కనిమ్రింగెనేనిఁ. ॥న్న॥

---

కాం— 13 పీలు-ఏకతాళము.

కరుణజూపవా? నాథా! వైరివినాశన
ధరణిపాల వందనీయ-దరుణిబ్రోవవా? ॥క॥
కాం తా మ తి కే క ష్ట ము ల్
కడదేర్పరావ? నాథా!
కష్టదశలలోనను-టి బ్రోవరావే. ॥క॥

---

చిత్రా— 14 హిం॥ తోడి—ఆటతాళము.

అయ్యోనాకాంతామతి! కాంతామతి! పోయెను హా! హా! ॥అ॥
హా పు డా నే ని ల
కడరాని పాట్లనొ్ప కత్తికిడియు
చంపియుంటిని కానలకు పాపమునక
బాల యేలీల నుండెనో? కానలందు
వేశ్యచే నిట్లుగల్గెగా వెతలునాకు. ॥అయ్యో॥

---

కాంతా— 15 హిం॥ తోడి-ఏకతాళము.

అకటా ! యేటికోపగించగా ? యీగవా నాయెడ-జ-న- ॥అ॥

నాథా ! యీగతి - బాధలనొందెదు - నగనిక్రోవవుగా ?

మా న స ము న

ప్రాయులునగని - మారునిబారికి - పాలైయుందుచునూ ॥

ద రి చే ర గ నా

మారశరీరా - మహితవిహారా - మనగలనే ? ధీరా॥

నిన్ గ న క ని ల ॥అ॥



1-2 రాజకుమారులు, 16 డైలాగ్.

1,రాజ॥ చెలియనీదు కౌఁగిలొసగి - చింతఁ జేర్పరాగదే ? ॥చె॥

కలికీ ! యామరుతూపుల - కిలకు తాళఁజాల నింక

చలమేలను - ననుచేకొను జలజానన ! మందగమన ! ॥చె॥

కాంతా—చాలునుపొమ్మా ! నీసరసమెల్ల దెలిసె నుమా ॥చా॥

పరతరుణుల నిటుఁగోరగ - పాపమనుచుఁదలఁపవా ? ॥చా॥

2,రాజ—దానయిటుఁబల్కనీకు - సరసమగునె దలపుమా ?

కానవుమున్నీధరగల - కామకోటిదన్నివట్టి

మానినీచరిత్రమెందు - మహిని వినవె కామినీ ! ॥చా॥

కాంతా—కాననెవరు లేరటంచు నెంచియు - మానసమున అనుమాన

మువదలియు పాత్రాపాత్ర విచారణసల్పక - పల్కుచుంటి

వేమందునునిన్నిఁక - ఏమని పిల్తుమూఢాత్ముడా మానవాధ

మాధముడా ఛీ. ఛీ. ॥ఏ॥



చంద్ర 17 ఝైలాగ్.

కొమ్మరొమ్ము రొమ్మును - తుమ్మెదల రొదవిని
నిమ్మళించ లేనమది - హాహా
చూడచూడనిటు చోద్యమయ్యె నాకు - సుందరాంగి యిదివిన
కనగా యింపుగాగా - సొంపుగాగా - పెంపుగాగా - అహా
యుండెనుజూడుము యీలతలా.

చలి॥ కీరశారికా కిలకిలరవములు - కిరవాణిబల్ తీరుగ నుండెను,
కోరికమన్మథుఁడు - చేరిబాణముల - నారీమణుల వయి - నడ
పెనోయనగా ?
కాయసాగెగా - కుతుకముతోడా।
చంద్రువదనా! సుందరనయనా! ॥కీ॥

చంద్ర॥ ఈయుద్యానము - యింపుగనుండెగా - యిందిరాక్షిరో! యి
దెనీవుగనుమా ?
విరులసొంపు - తిరులపెంపు - నారులకింపు - చారులసొంపు ॥యీ

---

చంద్ర॥ 18 హిం। తోడి — ఏకతాళము

అహాహా! యీయువకునిసరియగు - పురుషునిగంటిమ? వహ్వ
వహ్వ!
కంతు జయంతు వసంతుల మింగిలెగా - కాంతరో! వీనిపై
గలైను కాంతుల్
పూర్ణిమచంద్రునిసు గేరెడిమోముగా - భుజములు గిరులను బో
లెగా గనగా,
కర్ణములెంచగా - శిరిలనుమించగా - కనులను గాంచగా
కమలములనగా ॥అ॥

ఉత్త॥ 19ముఖారి—ఆదితాళము.

అహా ! కామినీ ! కనుపడవైతివ ?
కానలోనిన్ను నే కనికొనియుంటిని
చానరో ! నిన్నుఁగాంచ - చాలను నేనిఁక॥అ॥

---

దుష్ట॥ 20ముఖారి-ఆదితాళము.

అహా ! కాంతరో ! కనుపడవైతివ?
రాజ్యముఁగోల్పోతి- రామరో! నిన్నని
వ్యాజమువన్నిటు - వ్యర్థుడనైతిగ ॥ అ ॥

---

దాంగ 21 ముఖారి-ఆదితాళము

యాడపోతివే ? ఓ అడమడిశా ! యాడపోతివే ?
పెళ్ళిసేసుకుంటానని - పారిపోతివే ? అడమడిశా ॥యా॥

1, 2 రాజకుమారులు 22ముఖారి-ఆదితాళము.

అహా! మానినీ! కనుపడవైతివ?
నమ్మకముతో మమ్ము - నమ్మతివదచి
కొమ్మరో ! దుష్టుల - కొనిచనియుంటివొ? ॥అ॥

---

వ్రితా॥ 23ముఖారి-ఆదితాళము

హా! కాంతామణి ! కనుపడవైతి వ ?
నిన్ను నేగోల్పోతి - నిముసములోననే
నన్ను తాంగిరో ! నే - నిన్నిఁకఁగాంతునా ? ॥ హా॥

కాం॥ **24 మోహనరాగము- ఏకతాళము.**

కరుణగాంచి - కనికరించి - బ్రోవుమా నాథా !
పడితి కష్టములెన్ని నేను - బ్రతుకనేల? ప్రాణనాథ
కనకుబిమ్ములఁ గాంచియుండితి - కష్టములఁ గట్టుబెట్టి
క్రూరులచేఁబడి - కుందియున్నను
కృపచేఁగాంచియు - కూరిమినించియు ॥క॥

# జయంత జయపాలము.

గ్రంథకర్త—బద్దిరెడ్డి కోటీశ్వరరావుగారు.

ఒకవంక వేశ్యాపిశాచి మాయోపాయములు; ఒకవంక బాల్య మిత్రుల ప్రేమావలోకనము; ఒకవంక తుచ్ఛమోహసామ్రాజ్యమున గలుగు యిక్కట్లు; ఒకవంక రాజుమారిణి వ్యభిచారిణియై కత్తిచేబూని భర్తను భయంకరముగ హత్యజేయుట; ప్రాణమిత్రుని దుస్థితి; పతివ్రతాశిరోమణివలన మృతకుమారుడు పునర్జీవితుడగుట; భార్యల విడిచి పరాంగనాలోలురైనపురుషులుపడెడి పాట్లన్నియు నిందుజక్కగ వర్ణింపబడినవి—ఇంకు మేదరవాని జోలపాటలు; మహారాజపుత్రిక వ్యభిచారము, ప్రాణమిత్రుని పరితాపము, పతివ్రతమహాత్మ్యము మృదుమధుర శైలిలో వర్ణింపబడినవి. చదివినకొలది మనంబులకలు జనింపక పోవు. గద్య, పద్యములు, హృద్యముగనుండును—

వెల రు, 0-12-0

వలయువారు:- చందా నారాయణసెట్టి బుక్కుసెల్లరు
జనరల్ బజార్ శికిందాబాదు (దక్కన్.)

# కనకతారానాటకము.

(గ్రంథకర్త.—చందాల కేశవదాసుగారు.)

ఇందు క్రూరసేనుని మందగములు, కమలాదేవియొక్క విచారము, తారాకనకసేనుల పరితాపము, జాలరుల యమూయకత్వము దొంగల చాతుర్యరసము, మొదలగు వంశములు గలవు! ఈనాటకము అనేకచోట్ల ప్రదర్శింపబడి వన్నె కెక్కియున్నది. దీనిగురించి విశేషము వ్రాయుబనిలేదు. వెంటనే ఆర్డరును బంపుము. వెల 1-4-0

# వేశ్యాహితబోధిని.

(గ్రంథకర్త:—ద్రోణంరాజు సీతారామారావుగారు.)

ఇందు వేశ్యలయొక్క మాయోపాయములును, విటులయొక్క దురవస్థయున్ను, వేశ్యలకు మెడకట్టించి దివాళాదీయుటయు, వేశ్యలు జూపు కపటానురాగము, విటులు కల్లప్రేమను నమ్మి ధనమంతయు వేశ్యకు ధారబోయుట, చివరకు యేడ్చుట మొదలగు నంశములతో వ్రాయబడినది. ఈపుస్తకము చదివిన జరిగినగాథయే యని యనక మానరు. వెల వకరూపాయి మాత్రమే—

# వేశ్యామధురము పా III

(గ్రంథకర్త:—ద్రోణంరాజు సీతారామారావుగారు)

ఇంకు బ్రాహ్మణవితంతువుయొక్క బహిరంగ వేదాంతము. తుట్టతుదకు వేశ్యలలోగలసి వేశ్యావృత్తిచే పోషింపబడుచు నొక నరసుకు మోసముజేసి సాహెబ్ తో నంటగల్పుట, వేశ్యలయొక్క మర్మములు, విటులమాయలు, ప్రపంచమున జరుగునట్టి చర్యలన్నియు నిందు వ్రాయబడినవి. వెల 0—8—0